# విశ్వప్రకాశం

## ఆధ్యాత్మిక మాసపత్రిక

### శ్రీ నరసింహ జయంతి సంచిక

మే, 1996

సంపుటి : 2 సంచిక : 7 వెల : రూ. 5-00



ప్రకాశకులు
సర్వార్థ సంక్షేమ సమితి
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్
గాంధీనగర్, హైదరాబాద్ 500 380

ఈ సంచికలో ..............



-ముఖచిత్రం : శ్రీ లక్ష్మీనృసింహస్వామి

సంపాదకీయం

# నరసింహ జయంతి

అఖిలభారతదేశంలోనూ చూస్తే తెలుగువారికి నృసింహస్వామి ఆరాధన పట్ల ఎక్కువ ప్రతిపత్తి, ప్రవృత్తి ఉన్నట్లు కన్పిస్తాయి. దక్షిణదేశంలో తత్రాపీ తెలుగునాట నృసింహస్వామిని అర్చించే సంప్రదాయం తక్కినచోట్ల కన్నా ఎక్కువ కన్పిస్తుంది. నరసింహస్వామి దేవాలయాలు ఆంధ్రదేశంలో ఉన్నన్ని భారతదేశంలో ఇతరప్రాంతాలలో ఎక్కడా లేవు అని నిస్సందేహంగా చెప్పవచ్చు. ప్రసిద్ధమైన నృసింహక్షేత్రాలన్నీ తెలుగునాటనే ఉన్నాయి. ఇది ఒక విశేషం. తెలుగువారి పేర్లలో కూడా నరసింహస్వామి పేర్లు ఎక్కువ. స్త్రీనామాల్లో తక్కిన భారతదేశం మొత్తంమీద నరసింహస్వామి సంబంధమైన పేర్లు కనబడవేమో! సింహాద్రి అప్పన్న పేరు విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలో ఆడామగా అనే భేదం లేకుండా పెట్టుకొంటారు. విజయనగరం రాజవంశంలోనే ఒక అప్పలకొండయాంబ వుంది. అప్పన్నలు, అప్పమ్మలు, అప్పారావులు, అందరూ నరసింహస్వామి మ్రొక్కులను సూచించే పేర్లే. ముఖ్యంగా శ్రీవైష్ణవులలోనూ, స్మార్తులలోనూ కూడా 'ఆచార్యు'లు, 'రావు'లు, 'శాస్త్రి'గారలు నరసింహస్వామిపేరిట ఎందరో కన్పిస్తారు. 'నరుసు' ఆడపిల్లకైనా, మగపిల్లవాడికైనా ముద్దుపేరు తెలుగునాట.

ఆదిశంకర భగవత్పాదులు గొప్ప నృసింహభక్తుడని ఐతిహ్యం. ఆయన లక్ష్మీనృసింహకరావలంబన స్తోత్రం ఎంత బాగుంటుంది? అమరుక మహారాజు కథ విశ్వాసయోగ్యం అయినా కాకపోయినా కరావలంబన స్తోత్రం మాత్రం భగవత్పాదులవారిదే కదా! కాపాలికుడెవరో శంకరుడిపై క్షుద్రప్రయోగం చేయగా శంకరభగవత్పాదుల వారి శిష్యుల కొకరికి నృసింహావేశమై ఆ కాపాలికుణ్ణి తుద ముట్టించినట్లుగా శంకరచరిత్రంలో కథ వుంది.

ఒకప్పుడు కాశ్మీరంలో నృసింహోపాసన అత్యున్నతప్రాయదశంలో ఉండేదనటానికి ఆధారాలున్నాయి. లోకోత్తరసాహితీ ప్రతిభాసంపన్నుడైన శ్రీమదానందవర్ధనాచార్యులవారుకూడా నృసింహోపాసకుడని ప్రతీతి. అభినవ గుప్తపాదులవారు కూడా నృసింహ అర్చనాపరుడని అంటారు.

తెలుగుసాహిత్యానికి వస్తే కవిత్రయంలో ఒకరైన మహానుభావుడు ఎఱ్ఱాప్రెగడ

లక్ష్మీనృసింహపురాణం రచించారు. దానికి వేలూరు శివరామశాస్త్రి మహోదయుల పీఠిక తప్పకుండా చదవదగ్గది. తెలుగువారికి అత్యంత ప్రీతిపాత్రుడైన పోతన మహాకవికి ఎఱ్ఱాప్రెగడగారు ఎంతగురుతుల్యులో శివరామశాస్త్రిగారు చక్కగా లక్ష్మీనృసింహపురాణ పీఠికలో నిరూపించారు. నరసింహస్వామి, చెంచులక్ష్మి ప్రణయం, పరిణయం గూర్చినన్ని పద్యాలు, పాటలు, యక్షగానాలు, స్తోత్రాలు తెలుగులో ఉన్నన్ని మరి ఏ ఇతర భారతీయ భాషలోనూ ఉండవు. 'చెట్టు లెక్కగలవా నరహరి!' తెలుగుజానపదుల నరసింహభక్తి సంభరిత పరిహాస తాదాత్మ్యానికి తార్కాణ.

తెలుగునాట ఉన్నన్ని నరసింహస్వామి క్షేత్రాలు మరిఎక్కడా లేవు. ఛత్రపురం నుంచి చిత్తూరు దాకా, ఆదిలాబాదు నుంచి అనంతపురం దాకా సుప్రసిద్ధమైన నృసింహక్షేత్రాలు ఆంధ్రదేశంలో నెలకొని ఉన్నాయి. ఒకప్పుడు తెలుగుదేశమంతా నరసింహక్షేత్రంగానే ఉండేదేమో? ఇప్పటికీ తెలుగునాట ప్రతిప్రాంతంలోనూ ప్రసిద్ధమైన నరసింహక్షేత్రాన్ని ఒకదాన్ని పేర్కొనవచ్చు. తెలుగునాట నృసింహోపాసన సంప్రదాయం ఒక అధ్యయనంగా ఆయా క్షేత్రమాహాత్మ్యాలను, గుళ్లగోపురాలను, స్థానికగాథలను, ప్రభావాలను అర్చావిగ్రహ ఆలయశిల్ప ఛాయాచిత్రాల సహితంగా సంకలితం చేయాలని నాకెంతో అభిలాష అని ఒక మిత్రుడన్నాడు. కాని నెరవేరటం దాకా ఎందుకు? ప్రారంభమే అయినట్లుగా తోచదు. అలాంటి పని ఎంతో స్తుత్యం. ఆహ్లాదకరం. తెలుగులో నరసింహస్వామి శతకాలుకూడా ఎక్కువసంఖ్యలోనే వచ్చాయి. 'వైరిహరరంహ సింహాద్రినారసింహ' 'ధర్మపురి నారసింహ' మకుటాలతో వచ్చిన శతకాలు ఎంతో సుప్రసిద్ధాలు. ప్రసిద్ధమైన ఆంధ్రదేశ నరసింహక్షేత్రాలను పేర్కొనడం అక్కడి విశేషాలను తెలియజేయడం సులభసాధ్యం కాదు. మంగళగిరి పానకాల నరసింహస్వామి - ఈ గిరిని అరవవాళ్ళు తోతాద్రి అంటారుట - వేదాద్రి నరసింహస్వామి కూడా చాలా ప్రసిద్ధుడు. కృష్ణానది ఒడ్డునే చాలా అందమైన తీర్థయాత్రాక్షేత్రం వేదాద్రి. శ్రీ కేశవతీర్థస్వామి నృసింహోపాసకుడు. కృష్ణ ఒడ్డుననే పల్నాడులో గల ఇంకొక నృసింహ క్షేత్రాన్ని పునరుద్ధారణం చేశారు శ్రీ కేశవతీర్థస్వామి. మట్టపల్లి నరసింహస్వామిపైనా, వేదగిరి నరసింహస్వామిపైనా ఆయన శతకాలు వ్రాశారు. మంగళగిరి, వేదాద్రి, మట్టపల్లి, సింహాచలం, అహోబిలం, పెన్న అహోబిలం, కదిరి, యాదగిరి, నుందిళ్ళ (కరీంనగరం జిల్లా), సింగరాయకొండ, నాచారం, మాల్యాద్రి, పెంచలకోన, కోరుకొండ, ఖమ్మంమెట్టు, పాదిలి, ఆకిరిపల్లి, సింగరుట్ల, మొదలైనవి ఆంధ్రదేశంలో ప్రసిద్ధమైన నృసింహక్షేత్రాలు.

తిరుపతి వేంకటేశ్వరస్వామి దేవాలయంలోకూడా యోగనరసింహస్వామి ఉన్నాడు.

నరుడు సింహమై అధర్మాన్ని, అక్రమాన్ని మట్టుపెట్టాలని శ్రీ నరసింహావతార దివ్యప్రబోధం. శ్రీనృసింహావిర్భావ ఘట్టాన్ని పోతన మహాకవి పరమరమణీయంగా వర్ణించారు.

శ్రీ అక్కిరాజు వేంకటేశ్వర శర్మ రచించిన శ్రీ లక్ష్మీనృసింహ సుప్రభాతానికి దివ్య ఆశీషం అందజేశారు శ్రీ విశ్వంజీ మహరాజ్‌వారు. అందులో వారిట్లా అన్నారు: "లక్ష్మీనరసింహస్వామి ఈ యిలలో పిలిచిన పలికే దైవం. ఆరోగ్యప్రదాయి. ఆనందదాయి. మోక్షప్రదాత. అష్టలక్ష్మీ ప్రదాత. సమస్తబాధానివారకుడు. భూతప్రేతపిశాచాది బాధల నుండి జీవులను ఉద్ధరించే రక్షకుడు. అట్టి లక్ష్మీనరసింహ స్వామిని స్తుతించటం, ఆరాదించటం ప్రతిమానవుడి కర్తవ్యం."

దుష్టులు ఎన్నెన్ని మాయలు ఆలోచించినా కూహకాలు పన్నినా కుట్రలు తలపోసినా భగవంతుని మోసగించలేరు అని హిరణ్యాక్షహిరణ్యకశిపుల వృత్తాంతం తెలుపుతున్నది. శ్రీ వేంకటేశ్వరశర్మ తమ లక్ష్మీనరసింహస్వామి సుప్రభాత నివేదనంలో నరసింహస్వామి మహత్తు మనోహరంగా వర్ణించారు.

"హిరణ్యకశిపుడు అతికఠోర తపస్సు చేసి బ్రహ్మదేవుని మెప్పించి మృత్యువు నుండి తప్పించుకొనుటకై చిత్రవిచిత్రములగు వరములను పొందెను. లోకకంటకుడై సజ్జనులను బాధించెను. శ్రీమహావిష్ణువు హిరణ్యకశిపుని వరములకు అతీతమైన రీతిలో అతనిని సంహరించెను.

పగలు రాత్రియు కాని సంధ్యాసమయమందు లోపల వెలుపల కాని నభాద్వార మందు ఆకాశము గాని భూమియు గాని తనతొడలపై నుంచి ప్రాణరహితములును ప్రాణసహితములును గాని గోళ్ళతో పూర్తిగా మానవరూపమును జంతురూపమునుగాని నరసింహరూపముతో హిరణ్యకశిపుని వధించెను. హిరణ్యకశిపుని వక్షమును చీల్చునపుడు వజ్రాతికర్కశములైన ఆ స్వామి నఖములు, భక్తాగ్రేసరుడగు ప్రహ్లాదుని తలను వాత్సల్యముతో నిమురునప్పుడు పుష్పకోమలములు".

పంజాబ్‌లో ముల్తాన్ అనే చోట హిరణ్యకశిపుడి వధ, ప్రహ్లాదుడికి అభయప్రదానం జరిగినట్లు ఐతిహ్యమనీ ఉత్తరహిందు స్థానంలో కాంగ్రెసు సమావేశాలకు వెళ్లినపుడు ఆ ప్రదేశానికి వెళ్లి చూసినట్లు ఆంధ్రకేసరి ప్రకాశం స్వీయచరిత్రలో చెప్పారు. అయితే ఉత్తర హిందూ దేశంలో కాని వాయువ్య భారతంలో కాని శ్రీ

నృసింహస్వామి అర్చన ఇప్పుడు ఉన్నట్లు కన్పించదు.

ప్రహ్లాదచరిత్రం పోతనగారి వల్లనే కావచ్చు తెలుగువారికి ఎంతో ప్రీతిపాత్రం. కూచిపూడి భాగవతులు నరసింహస్వామి భక్తులనీ, నరసింహోపాసకులనీ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు "వేయిపడగల"లో యక్షగాన ప్రదర్శనల ఘట్టపు అధ్యాయాలలో వారి గొప్పతనాన్ని పరమాద్భుతంగా వర్ణించారు. ఆంధ్రదేశంలో శ్రీనృసింహజయంతిని భక్తిప్రపత్తులతో జరుపుకొంటారని తెలుగుబుతువులలోకూడా విశ్వనాథ ప్రస్తావించారు. వైశాఖ శుద్ధ త్రయోదశి నాడు శంకరమఠాలలో పానకం, మామిడిపళ్ళు, విసనకర్రలు సమర్పించి వేదవిదులను గౌరవిస్తారు.

ఇదీ తెలుగువారికి నరసింహస్వామితో ఉన్న అనుబంధం, సుయోగం.

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక హృన్నివాస
భక్తానురక్త పరిపాలన పారిజాత
లక్ష్మీనృసింహ మమదేహికరావలంబమ్
ఏకేన చక్ర మపరేణ కరేణ శంఖ
మన్యేన సింధు తనయా మవలంబ్య తిష్ఠన్
వామేకరేణ వరదాభయహస్త ముద్రాం
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్
అద్యన్త శూన్యమజమవ్యయ మప్రమేయ
మాదిత్యరుద్ర నిగమాదినుత ప్రభావమ్
త్వాంభోధిజాస్య మధులోలుపమత్తభృంగం
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్
మాతా నృసింహశ్చ పితా నృసింహః
భ్రాతా నృసింహశ్చ సఖా నృసింహః
విద్యా నృసింహోద్రవిణం నృసింహః
స్వామీ నృసింహ స్సకలం నృసింహః
ప్రహ్లాదమానస సరోజవిహారభృంగ
గంగాతరంగ ధవళాంగ రమాస్థితాంగ
శృంగారసంగర కిరీట లసద్వరాంగ
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్ -

- ఆచార్య శంకర భగవత్పాద కరావలంబ స్తోత్రమ్

**శ్రీ జిల్లేపల్లి భాస్కరరావు**

ఓంకారము శ్రీకారము నొనరించెడి ఝుంకారము
జీవశక్తి కాకారము చేర్చి నిల్పు చైతన్యము -
విశ్వశాంతి కలుగుటకు వినయమదే తొలిమెట్టు
ఐశ్వర్యము మానవాళి కందించుచు నిలబెట్టు ॥

స్వర్గపు వాకిళ్ల తెరచి చూడందగు పనిని బెట్టు
ప్రాజ్ఞుల పరిచయకాంతుల ప్రసరణలో కనికట్టు -
యోగి భోగి త్యాగి యోచు వసతి పెంచు దశల నించు
రాగామృత ప్రేమతత్వ రసరాజములను పంచు ॥

ఛాందసము మూఢత్వము చేరనీదు మానవాళి
కాందిశీకులని పీడక కలిగించు సదా నివాళి -
విశ్వశాంతి చేకూరును వినయము వివేకములను
సామరస్య సాధనగా సాగి నడుపుకున్నయడల ॥

బ్రహ్మకుమారియు ఈశ్వరి భ్రమరాంబయె మాయగాన
కలిమిడి స్నేహార్ద్ర చతుర కళా రూపి తాపసియౌ -
క్రోధలోభమోహ గరిమ కూడదన్న విజ్ఞానం
సాధనగా యూజవాళి సాగించే మార్గముంచు ॥

మనోమయము బుద్ధిగతము మననుకంటు నహంకార
వినిమయ విజ్ఞానకోశ విషయాంబుధి నుతారతార -
ఏకత్వై అనేకతను ఎన్ను మార్గాల జూపి
సాకల్యము ఏకమంచు చాటిచెప్పు ననుభవాల ॥

ఓహో దానినందుకొనుడు అంతు తెలిసి మధియించుడు
సర్వచక్షుదృష్టి కందు సమానతయె విశ్వశాంతి ॥

# హృదయవిద్య

(గత సంచిక తరువాయి)

శ్రీజిన్నూరు నాన్నగారు

(నాన్నగారి ప్రవచనముల నుంచి)

అందువలన ముందు నీ లోపల ఉన్న శత్రువులను తొలగించుకోవటానికి ప్రయత్నం చెయ్యి అని ప్రహ్లాదుడు చెప్పాడు. ప్రహ్లాదుడికి భక్తులలో అగ్రస్థానం ఇచ్చారు. ఆయనకున్న ఏకాగ్రత, పవిత్రత, పరమేశ్వరునిపట్ల ఆయనకున్న సజీవమైన విశ్వాసము అటువంటివి. నీ హృదయంలో ఉన్న పరమేశ్వరుని మీద నీకు సజీవమైన విశ్వాసం ఉంటే ఆయన నీకు వ్యక్తమవుతాడు. అనుమానం పనికిరాదు. మనం చేసే ప్రయత్నానికి ఇతరులు ఎవరూ అడ్డురారు. భగవంతుడు ఉన్నాడా లేడా అనే అనుమానమే మనకు అడ్డువస్తూ ఉంటుంది. అందువలన అనుమానం పెట్టుకోవద్దు. నీ హృదయంలో పరమేశ్వరుడు ఉన్నాడు. నీకు తెలియటం లేదు. మేము సాధన చేస్తున్నాము నీకు ఉన్న అలవాట్ల వలన నీకు ఉన్న జీవ లక్షణముల వలన నీహృదయంలో ఉన్న పరమేశ్వరుడు అభివృద్ధి కనబడటం లేదు అని కొంతమంది చెపుతూ ఉంటారు. సాధన చేస్తున్నప్పటికి అభివృద్ధి కనబడకపోతే ఆ మనిషికి వైరాగ్యం లేదు అని అర్థం. సాధకుడు, అభ్యాసము, వైరాగ్యములను విడిచిపెట్టరాదు అని భగవంతుడు గీతలో పదే పదే చెప్పాడు.

నీ దేహమును ప్రారబ్ధమునకు విడిచిపెట్టు. నీవు వచ్చిన పని ఏదో అది చూసుకో అని భగవాన్ చెపుతూ ఉండేవారు. ప్రారబ్ధమునుబట్టి దేహం వస్తుంది. ప్రారబ్ధం లేకపోతే దేహమేరాదు. దేహం వచ్చింది అంటే ప్రారబ్ధం ఉన్నట్లు గుర్తు. వారు దేవతా పురుషులు అవ్వవచ్చు. సామాన్య మానవులు అవ్వవచ్చును. సత్పురుషులు చేసిన పుణ్యాం, దుష్టులు చేసిన పాపం ఇవి రెండూ కలిసి భగవంతుని దేహమునకు ప్రారబ్ధం అవుతాయి అని పెద్దలు చెపుతారు. ఆ దేహమునకు కూడా ప్రారబ్ధం ఉంటుంది. కృష్ణుడి దేహమునకు ప్రారబ్ధం ఎలా ఉందో అలాగే మన దేహమునకు కూడా ప్రారబ్ధం ఉంది. ప్రారబ్ధం ద్వారా మనం నేర్చుకోవలసిన పాఠాలు నేర్చుకొన్నాక ఆ దేహం పడిపోతుంది. దేహము పుట్టినపుడు నీవు పుట్టలేదు. అందుచేత దేహం మరణించినపుడు నీవు మరణించవు అని భగవాన్ చెప్పారు. నేను అనే

ప్రథమ తలంపు పుట్టినప్పుడు నీవు పుట్టావు. అది ఎప్పుడయితే అణిగిపోయిందో అప్పుడు నీకు పునర్జన్మలు ఆగుతాయి అని భగవాన్ చెప్పారు

మనస్సుకు దేహం కావాలి, లోకం కావాలి, దేవుడు కావాలి కాని ఆత్మకు దేహంతో పనిలేదు, లోకంతో పనిలేదు, దేవుడితో పనిలేదు అది ఉండటం వలననే అది తెలియబడుతుంది. అది ఉందని తెలియబడటానికి బాహ్యమైన సహకారం ఏమీ అక్కరలేదు. అది నీ ఇంద్రియాలకు, నీ మనస్సుకు అందకపోవచ్చును. నీ అనుభవానికి అందుతుంది. రామకృష్ణ పరమహంస ఒకమాట చెప్పారు. నీటిలో ఉప్పును కలిపితే అది నీ కళ్ళకు కనబడదు. కాని నోటిలో వేసుకుంటే అది ఉప్పునీరు అని తెలుస్తుంది. పరమేశ్వరుడు నీ కళ్ళకు కనబడక పోయినా అనుభవానికి వచ్చినప్పుడు నీ నాలుకకు ఎలా తెలుస్తోందా అలాగే నీ హృదయానికి పరమేశ్వరుడు తెలుస్తాడు. ఋజువులు, సాక్ష్యాలు అక్కరలేదు. ఆయన నీ అనుభవానికి అందుతాడు. నీకు మోక్షం కావాలంటే శరీరం మరణించే వరకూ ఆగనక్కరలేదు. మరణానికి, మోక్షానికి ఎట్టి సంబంధము లేదు. ప్రారబ్ధం పూర్తి అయిన వెంటనే శరీరం మరణిస్తుంది. శరీరం ఈ భూమిమీద ఎక్కడ ఉండాలి. ఎన్ని సంవత్సరాలు ఉండాలో, ఏ పని చేయాలో అవి అన్నీ ఆలోచించవద్దు. నీవు వచ్చిన పని చూసుకో. నీవు ఎవడివో నీవు తెలుసుకోవటానికి ప్రయత్నించు నీవు ఎవడివో నీకు తెలిస్తే అదే మోక్షము

శరీరం మరణించిన తరువాత ఏ నేనును అయితే నీవు వైకుంఠమునకు పంపుదామని అనుకొంటున్నావో, ఏ నేనుతో అయితే రావటాలు, పోవటాలు అనే పనులు చేద్దామని అనుకొంటున్నావో, ఏ నేనును అలంకరించాలను కొంటున్నావో ఆ నేను నుండి విడుదల పొందటమే మోక్షము. అందరూ ఈ నేనుతో సాధనలు చేద్దామని ఉబలాట పడేవారే గాని సాధన చేస్తున్న ఈ నేను ఎవరు? అని ప్రశ్నించేవారు ఒక్కరూ కనబడటంలేదు అన్నారు భగవాన్.

మనం చేసే పనిలో భక్తి ఉండాలి. భక్తి మనకు పనికి రానిది కాదు. దైనందిన జీవితములో మనం ఏ పనిచేసినా అక్కడ భక్తి ఉండాలి. భక్తి ఉంటేనే ఆ పనిని మనం బాగా చేయగలము. భక్తిని ప్రాక్టీసు చేస్తే మనం చేసేపనిలో Perfection వస్తుంది. ఎవ్వడైతే నిరంతరము తన స్వరూపమైన ఆ ఆత్మను ధ్యానం చేస్తున్నాడోవాడే భక్తుడు. నీవు ఏ ఆత్మగా ఉన్నావో, ఏ చైతన్యంగా ఉన్నావో దానిని నిరంతరము ధ్యానం చేయటమే భక్తి అని ఆచార్యులవారు చెప్పారు. మనం వంట చేసుకోవటానికి కుండ, పొయ్యి, నిప్పు, పుల్లలు ఇలా సామగ్రి అంతా మనకు ఎలా అవసరమో అలాగే నీవు

ఆత్మానుభవం పొందటానికి కావలసిన సామగ్రిలో భక్తి కూడా అవసరము అని ఆచార్యులవారు చెప్పారు.

కంసాలి వస్తువులను చూడడు. ఆ వస్తువులలో ఉన్న బంగారమును చూస్తాడు. అలాగే జ్ఞాని నామరూపములను చూడడు. అందరి హృదయములో ఉన్న ఆత్మను చూస్తాడు. ఒకరు రమణ మహర్షిగార్ని అడిగారు. మీరు అలా శూన్యంలోనికి చూస్తున్నారు. ఎవరిని చూస్తూన్నారు అని అడిగారు. ఎవరినైనా చూడటానికి నాకు భిన్నంగా ఏమి ఉంది. నన్ను నేనే చూసుకొంటున్నాను అన్నారు భగవాన్.

బయట ఉన్న వస్తువులతో మన మనస్సుకు ఉన్న సంబంధమును, బయట ఉన్న నామరూపములతో మన మనస్సుకు ఉన్న సంబంధమును, బయట ఉన్న వ్యవహారములతో మన మనస్సుకు ఉన్న సంబంధమును వృత్తి ఉంటారు. అహం వృత్తిలో వృత్తి పోతే చాలు. మన స్వరూపములో దుఃఖము లేదు. అందుచేత మనం దుఃఖమును కోరుకోవటం లేదు. మన స్వరూపంలో మరణం లేదు, అందుచేత మనవం మరణం అంటే ఇష్టపడటం లేదు. ఎందుచేత మనం జ్ఞానమును కోరుకొంటున్నాము, అంటే మన స్వరూపములో ఉన్నది జ్ఞానమే. మనకు తెలుసున్నా, తెలియకపోయినా మన స్వరూపములో ఏదైతే ఉందో దానినే మనం కోరుకొంటాము.

దేహము లోపల నేను ఉన్నానని, దేహము బయట ప్రపంచము ఉందని, ఎక్కడో వైకుంఠములో దేవుడు ఉన్నాడు అని అనుకొంటున్నాము. ఇవి అన్నీ మనస్సు యొక్క కల్పితములు. ఆత్మకు లోపలలేదు. బయటలేదు. లోపల బయట మనస్సుకే. దేహబుద్ధి ఉన్నవాడికి లోపల, వెలువల ఉంటాయి. ఆత్మబుద్ధి ఉన్నవాడికి లోపలలేదు. బయటలేదు.

నీకు ఏ మార్గము ఇష్టమైతే ఆ మార్గములో సాధన చెయ్యి. భక్తిమార్గము, కర్మమార్గము, ధ్యానమార్గము ఇలా నీకు ఏ మార్గము సుఖంగా వుంటే ఆ మార్గములో ప్రయాణం చెయ్యి. కాని తెలుసుకోవలసింది ఏమిటి అంటే దేహగతమైన నేను నుండి విడుదల పొందటమే. అదే మోక్షము.

అత్యంత సులభం ఆత్మ విద్య అని భగవాన్ చెపుతూ ఉండేవారు. ఆత్మానుభవం సంపాదించటం అత్యంత సులభం అనేవారు. దానికి కారణం అది నీ స్వరూపమే. అది నీకు దూరానలేదు. ఆ వస్తువు నీలోపలే ఉంది. నీకోసం ఎదురుచూస్తోంది. రవ్వంత, ముల్లంత నీ మనస్సును లోపలకు

త్రిప్పగలిగితే అది నీకు తెలుస్తుంది. అన్నం నోటికి అందించినట్లుగా నీ మనస్సును హృదయంలో ఉన్న పరమేశ్వరునికి అందియ్యి. వాడే నమిలి, తినేస్తాడు. వాడికి ఆహారం ఇదే.

దేవుని తెలుసుకోవాలి, ఆత్మను తెలుసుకోవాలి అని అంటున్నారు. మంచిదే. కాని దేవుని తెలుసుకోవాలి అనే ఈ నేను ఎవడు? అని మధ్య మధ్య ప్రశ్నించుకోండి అని భగవాన్ చెపుతున్నారు.

రమణమహర్షిగారు చెప్పినది Spiritual Science. ఆయన హేతువాదులకు హేతువాది. దేవుడు ఉన్నాడా, లేడా అని రమణమహర్షి గారిని అడిగారు. ఆయన చెప్పిన సమాధానంలో ఉన్న అందాలు చూడండి ఇటువంటి సమాధానాలు ఏ ఉపనిషత్‌లలోనూ కనబడవు. ఈయన ఒక Scientific పద్ధతిలో చెప్పారు. ఇంత అందమైన సమాధానాలు, ఇంత పొట్టి సమాధానాలు మీకు ఎక్కడా కనబడవు. ఇక్కడ వేదాలు, ఉపనిషత్‌లు చదువుకొన్నవారు ఉండవచ్చు, పండితులు ఉండవచ్చు. ఈ సమాధానాలు ఎక్కడ ఉన్నాయో చూడండి. మనకు ఎదురుగుండా ఉన్న వస్తువు లోకువ. దూరపు కొండలు నునుపు. దేవుడు ఉన్నాడా లేడా అని భగవాన్‌ను ప్రశ్నిస్తే భగవాన్ ఏమన్నారు అంటే నువ్వు ఉన్నావా అని అడిగారు. నేను ఉన్నాను అన్నాడు. నువ్వు ఉంటే వాడు లేకుండా ఎక్కడికి పోతాడు అన్నారు భగవాన్. ఎంత అందంగా ఉందో చూడండి. దీనికి reference ఏమీ అక్కరలేదు ఆయన అనుభవంలో నుండి తీసి ఇవ్వటమే. నువ్వు ఉంటే లోకం ఉంది. నువ్వు ఉంటే దేవుడు ఉన్నాడు. నీవు మంచిచేస్తే మంచి, నీవు చెడ్డచేస్తే చెడ్డ నీకు ఫలితమును అందచేసేవాడే దేవుడు. వాడే ఈశ్వరుడు. ఈశ్వరుడు అంటే నియమించేవాడు.

ఈశ్వరుడు జీవులను వారి వారి ప్రారబ్ధమునననుసరించి ఆడిస్తున్నాడు. జరుగవలసినది జరిగే తీరును. జరుగరానిదీ ఎవరు ఎంత ప్రయత్నం చేసినా జరుగనే జరుగదు. అని భగవాన్ చెపుతూ ఉంటే అక్కడ ఉన్న ఒక ప్లీడరుగారు ప్రక్కనే ఉన్న టేబుల్ ఫ్యాన్ స్విచ్‌ను ఆఫ్‌చేసి ఈ రోజున ఈ టైములో టేబుల్ ఫ్యాన్ స్విచ్ ఆపటం అనేది కూడా నా తల్లి గర్భంలో నుండి బయటకు వచ్చినప్పుడే నిర్ణయం అయిందా. ఇది కూడా ప్రారబ్ధమేనా అని అడిగారు. పెళ్ళిళ్ళు, వృత్తి, ఇటువంటి పెద్ద సంఘటనలు ప్రారబ్ధమునుబట్టి జరుగవచ్చును. ఫ్యాన్ ఆపటంలాంటి చిన్న చిన్న సంఘటనలు కూడా ప్రారబ్ధమేనా అని అడిగారు. ఏమీ సంకోచము లేకుండా ఏమి అనుమానం

లేకుండా ఇవి అన్నీ కూడా ప్రారబ్ధమే. పెద్ద సంఘటనలు మాత్రమేకాదు ప్రతీ చిన్న సంఘటన కూడా దేహ ప్రారబ్ధమే అన్నారు భగవాన్. ప్రతీదీ ప్రారబ్ధము ప్రకారము జరిగితే ఇంక సాధన ఎందుకు అని అడిగారు. ప్రారబ్ధము కేవలము దేహానికి మాత్రమే. నీవు ఎవడివో నీవు తెలుసుకోవటానికి అదేమీ అడ్డురాదు. అక్కడ భగవంతుడు నీకు స్వేచ్ఛ ఇచ్చాడు. బాహ్యంగా ఇద్దరు ఒకే కష్టంను అనుభవిస్తున్నారు అనుకోండి. ఒకరికి ఆ కష్టం కష్టంలాగా కనబడదు. ఇంకొకరికి ఆ కష్టం చాలా పెద్దదిగా కనబడుతుంది.

ఎందుచేతనంటే receive చేసుకొనే Stationలో తేడా. నీవు సాధన చేస్తూ వుంటే, నీవు ఎవడివో నీకు తెలుస్తూ ఉంటే, హృదయాభిముఖంగా నీవు ప్రయాణం చేస్తూ ఉంటే నీ దేహము ప్రారబ్ధమును అనుభవిస్తూ ఉంటుంది. ఆ ప్రభావము నీ మీద పడదు. అది దేహమునకే సంబంధించినది అని నీకు తెలుస్తూ ఉంటుంది. సంఘటన జరుగుతూ ఉంటుంది. దాని ప్రభావం కించిత్తు కూడా, ముల్లంత కూడా నీమీద పడదు. దానికి సంబంధించిన దుఃఖము కూడా నీ మీద పడదు.

మనం చేసే సాధనలు అన్నీ రెండవ పక్షము. గురువు అనుగ్రహము అత్యంత ముఖ్యమైనది. గురువుతో ఉన్న సంబంధము తెగదు. ఆయన మీద ప్రేమ కలిగేట్టు ఆయనే చేసుకొంటాడు. ఒకోసారి గురువు మీద మనకు కోపం రావచ్చును. అయినా ఆయన కోపం తెచ్చుకోడు. గురువుమీద ఒకోసారి మనం react అవుతాము. అయినా ఆయన react అవ్వడు. చంటిపిల్లలను ముద్దుకోసం ఎత్తుకుంటాము. వాళ్ళు కాళ్ళతో మనలను తన్నుతారు. మల విసర్జన చేస్తారు. మూత్ర విసర్జన చేస్తారు. అయినా వాళ్ళను క్రింద పారవేయము. వారిపట్ల ముద్దుగానే ఉంటాము. అదేవిధంగా నిజమైన గురువుతో ఒకసారి మనకు అనుబంధము కలిగితే మనం ఆయనమీద react అయినా, మానసికంగా ఒకోసారి మనం ఆయనకు దూరం అయినా, ఆయన మీద మనకు ఇష్టం లేకపోయినా, మనం ఆయనను విడిచిపెట్టినా ఆయన మనలను విడిచిపెట్టడు. ఆయన మీద ప్రేమ, ఆప్యాయత కలిగేటట్లు ఆయన చేసుకొని ఆయన స్థితి మనకు అందేవరకూ ఆయన మనలను వదిచిపెట్టడు. వాడు గురువు.

రమణమహర్షిగారు ఆత్మ నిజం అని చెప్పలేదు. ఆత్మ ఒక్కటి మాత్రం నిజం అని చెప్పారు. నీవు నమ్మినది నిజం అవ్వదు. నీవు నమ్మినా, నమ్మకపోయినా ఆత్మ ఒక్కటే నిజం. దానిని అనుభవంలోనికి

తెచ్చుకోవటానికి నీవు sincereగా ప్రయత్నం చేస్తూ ఉంటే, dedicatedగా devotedగా నీకున్న సర్వశక్తులు సమర్పించి ప్రయత్నం చేస్తూ ఉంటే, అదే నా జీవితధ్యేయం అని ప్రయత్నం చేస్తూ ఉంటే, to be or not to be అనే లక్ష్యంతో నీవు ప్రయాణం చేస్తూ ఉంటే, గమ్యంను అందుకోవటం కోసం నీవు త్రికరణ శుద్ధిగా ప్రయత్నం చేస్తూ ఉంటే నీ హృదయంలో ఉన్న ఆత్మ నీ ప్రయత్నమును చూసి, నీ dedicationను devotionను చూసి రూపం ధరించి వస్తుంది. వాడే గురువు. ఒక్క ప్రహ్లాదుడికోసమే లక్ష్మీ నరసింహ అవతారము వచ్చింది. అదే విధంగా నీవు త్రికరణశుద్ధిగా ప్రయత్నం చేస్తూ వుంటే నీ హృదయంలో వున్న ఆత్మ అవసరమైతే నీ కోసం రూపం ధరించి వస్తుంది. రూపం ధరించి వచ్చి బాహ్యంగా విజృంభిస్తున్న నీ మనస్సును లోపలకు నెట్టుతుంది. లోపలకు త్రిప్పబడిన మనస్సును లోపల ఉన్న గురువు గుంజుకుంటాడు.

సాధన చేసేటప్పుడు ప్రారంభదశలో కొంత కష్టంగా ఉండవచ్చును. వాసనలు బలీయంగా ఉండవచ్చును. అప్పుడు సాధన కొంత కష్టంగా ఉంటుంది. మన అందరికి భగవంతుని తెలుసుకోవాలి అని వుంది. అలాగే మనకు తెలియబడాలి అని భగవంతుడు కూడా అనుకోవాలి. అప్పుడు మాత్రమే ఆయన తెలియబడతాడు. పెళ్ళి జరిగేటప్పుడు తెరచాటు నుండి పెళ్ళికూతుర్ని కొద్దికొద్దిగా చూస్తూ ఉంటారు. మీరు సాధన చేసేటప్పుడు తెరచాటు నుండి పెళ్ళికూతురు కనబడినట్లుగా మీ హృదయంలో ఉన్న వస్తువు కొద్ది కొద్దిగా కనిపిస్తూ ఉంటుంది. బాగుంది కొద్దిగా తెలుస్తోంది అని మనకు అనిపిస్తుంది. మరల మరుగైపోతుంది. మీ మనస్సుకు ఆ వస్తువు కొద్దిగా తెలిసినప్పటికీ అది ఎన్నటికీ permanent కాదు. వాసనలు పూర్తిగా నాశనం అయ్యే వరకు మీరు పొందేస్థితి permanent కాదు.

Money comes and goes, Morality comes and grows. అని ఇంగ్లీషులో ఒక సామెత ఉంది. డబ్బు వస్తూ ఉంటుంది. పోతూ ఉంటుంది. కాని నైతిక విలువలు సంపాదిస్తే అవి పోవు, పెరుగుతూ ఉంటాయి. వచ్చే జన్మకు కూడా వస్తాయి. నీకు నైతిక విలువలు ఉన్నాయి అనుకో, స్మశానంలో శరీరం కాలిపోయినపుడు నైతిక విలువలు కాలవు. వచ్చే జన్మకు కూడా అవి వస్తాయి.

ఇంద్రియాలకు సంబంధించిన భోగాలు ఎదురుగా ఉండాలి. భోగాలు ఎదురుగా ఉన్నప్పటికీ ఇంద్రియాలకు [illegible] గా కూడదు. ఇది సాధకుడి

లక్షణము అని కాళిదాసు చెప్పాడు. నీవు ఎంత సాధన చేస్తున్నప్పటికి ఒకో దేహముతో నీ అభివృద్ధి ఆగిపోతూ ఉంటుంది. ఎంత సాధన చేసినా అభివృద్ధిలోనికి రాలేము. ఆధ్యాత్మికంగా అభివృద్ధి పొందాలి అనే కాంక్ష. మోక్షమును పొందాలి అనే నీ తపనను భగవంతుడు చూస్తూ ఉంటాడు. ఈ దేహం మరణించిన తరువాత భగవంతుడు ఏమి చేస్తాడు అంటే ఎటువంటి కుటుంబములో నిన్ను ప్రవేశపెడితే నీకు బ్రహ్మానుభవం కలుగుతుందో అటువంటి కుటుంబములో నీకు జన్మను ఇస్తాడు. కొన్ని కుటుంబాలలో పుడితే జ్ఞానం సంపాదించటానికి వాలు గాలిలో సైకిలు త్రొక్కినట్లుగా ఉంటుంది. కొన్ని కుటుంబాలలో పుడితే నీకు జ్ఞానం సంపాదించాలనే కోరిక ఉన్నా ఎదురు గాలిలో సైకిలు త్రొక్కినట్లుగా ఉంటుంది. భగవంతుడు ఏమి చెపుతున్నాడు అంటే నీ సాధన నిజమైతే నీకు అనుకూలమైన కుటుంబమును select చేసి పెడతాను అంటున్నాడు.

మంచి స్నేహితులు మనకు ఎలా ఉపకారం చేస్తారో అలాగే మంచి మాట కూడా మనకు ఉపకారం చేస్తుంది. అయితే ఆ మాట మన హృదయానికి హత్తుకోవాలి. ఆ మాటను మీరు మర్చిపోవాలన్నా మర్చిపోవటానికి వీలులేకుండా ఆ మాట మిమ్ములను వెంటాడాలి.

మనకు చదువు ఉండవచ్చు. ధనం ఉండవచ్చు. గౌరవం ఉండవచ్చు. ఎన్ని ఉన్నప్పటికి ఆత్మజ్ఞానము లేకపోతే శవమును అలంకరించినట్లుగా ఉంటుంది అని భగవాన్ చెప్పారు. ఆత్మవిద్యతో సంబంధము లేని భౌతికవిద్యలు మంటలో పెట్టిన కట్టెలు లాంటివి. మంటలో పెట్టిన కట్టెలు బూడిద అవుతాయి. అలాగే ఆత్మవిద్యతో సంబంధములేని భౌతికవిద్యలు బూడిద అవుతాయి.

అహంకారము ఉంటే అంతా ఉంది. అది లేకపోతే ఏదీలేదు అని భగవాన్ ఎక్కువగా చెపుతూ ఉండేవారు. అహంకారము ఉంటే నువ్వు ఉన్నావు. నేను ఉన్నాను, దేవుడు ఉన్నాడు, ప్రపంచం ఉంది, పుణ్యం ఉంది, పాపం ఉంది. ఈ అహంకారము ఎక్కడనుండి వస్తోంది అని వెతకటం ప్రారంభించు, సకలము ఊడిపోతుంది అంటున్నారు భగవాన్ అంటే అన్నీ ఊడిపోతాయి.

దేహము మరణించిన తరువాత మనం ఉండము. అందువలన భయం కలుగుతోంది. ఎక్కడైతే భయం ఉందో అక్కడ దుఃఖము ఉంటుంది.

ఎక్కడైతే attachment ఉందో అక్కడ దుఃఖము ఉంటుంది. Attachmentలేని వాడికి పాపం చేయవలసిన పనిలేదు. ఎక్కడైతే attachment ఉన్నవాడు పాపం చేసి తీరతాడు. Attachment పేరుమీద ఎన్నో దోషాలు, పాపాలు ప్రోగుచేసుకొంటాము. అందువలన detached life lead చెయ్యాలి. Detached Life lead చేస్తూ ఉంటే attachmentకు దూరం అవుతాము. ఎవడైతే detached life lead చేస్తున్నాడో వాడు దోషములనుండి, పాపములనుండి, బలహీనతల నుండి విడుదల పొందుతాడు. ఎప్పుడైతే దోషములనుండి, బలహీనతలనుండి విడుదలపొందాడో వున్న వస్తువు ఉన్నట్లుగా వాడికి వ్యక్తమవుతుంది.

సందేహాలు ఉంటే మీరు జ్ఞానిని ఆశ్రయించి, నేర్చుకోవాలనే కాంక్షతో వినయంగా జ్ఞానిని అడిగి నివృత్తి చేసుకోమని భగవంతుడు చెపుతున్నాడు. అహంకారము నశించిన వెంటనే ఈ దేహమును దేవుడు స్వాధీనం చేసుకుంటాడు. అంటే జ్ఞాని దేహమును భగవంతుడు స్వాధీనం చేసుకుంటాడు. వాడు మాట్లాడే ప్రతీమాట శాస్త్రమునకు సరిపోతుంది.

రమణ మహర్షిగారు ఒకమాట చెప్పారు. మీరు కాలువలలో మునుగుతున్నాడు. చలివేస్తుంది. కాశీ వెళ్లి గంగలో మునుగుతున్నారు. అక్కడా చలి వుంటుంది. రాజమండ్రివెళ్ళి గోదావరిలో మునుగుతున్నారు. అక్కడా చలి ఉంటుంది. మీ హృదయంలో మునగండి అక్కడ చలి ఏమీ ఉండదు. చలి వేయదు. సరికదా జ్ఞానం వస్తుంది. అక్కడ ఉన్నది జ్ఞానమే కాబట్టి జ్ఞానం వస్తుంది.

*(జిన్నూరు నుంచి వెలువడే 'శ్రీ రమణభాస్కర' సౌజన్యంతో)*

## తామ

# నారాయణ తీర్థులు
## (1580-1680)

*- ఆచార్య బి. రామరాజు*

దాక్షిణాత్య నామసిద్ధాంత భజన సంప్రదాయ ప్రవర్తకు లైదుగురిలో నారాయణతీర్థులవారొకరు. వారు సంకీర్తన, యక్షగాన సార్వభౌములు, అగ్రశ్రేణికి చెందిన శ్రీకృష్ణభక్తులు, లీలాశుక జయదేవుల అవతారమే నారాయణ తీర్థులని కృష్ణభక్తుల విశ్వాసం. జయదేవుని భక్తిశృంగారం కంటె నారాయణ తీర్థుల ఆధ్యాత్మిక భక్తికే పట్టంకడుతారు భక్తులు. నిరంతరం బ్రహ్మమగ్న మానసులై వారు రచించిన తరంగాలు పాడని భజనకూటాలుకాని దాక్షిణాత్య గాయకులుగాని ఉండరంటే అతిశయోక్తి కాదు. శివరామానందతీర్థులు గురువులు కావటంచేత ఆయనకు శివనారాయణతీర్థులని మరొక పేరు. నారాయణతీర్థులు 1580 ప్రాంతంలో జన్మించి 1614 లోపుగానే దక్షిణాదికి తరలిపోయి దాదాపు 1680 దాకా జీవించినట్లు ఆధారాలున్నవి. వారు బహుశః 1700 దాకా సజీవంగా ఉండి ఉంటారు. యోగులెందరో వందలేండ్లు బ్రతికినవారున్నారు. నారాయణతీర్థులు 120 ఏండ్లు బ్రతకటం వింతకాదు. నారాయణ తీర్థులవారి పుట్టుక పూర్వాశ్రమం చరిత్రల గురించి పలువురు పలువిధాలుగా వ్రాసినారు. ప్రొ. సాంబమూర్తిగారు ఆయన తమిళదేశంలో పుట్టినారన్నారు. మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారాయన అమలాపురంలో పుట్టినారన్నారు. వారి జన్మస్థలం కొందరు శ్రీకాకుళమంటే కొందరు శోభనాద్రి అన్నారు. ఈ వ్రాతలన్నింటి పూర్వాపరాలు చర్చించి తల్లావఝల శివశంకరశాస్త్రిగారు సమన్వయించి తీర్మానించినారు.

నారాయణతీర్థులవారు పూర్వాశ్రమంలో తల్లావఝలవారు. గుంటూరు జిల్లా కాజ వారి జన్మగ్రామం, పేరు గోవిందశాస్త్రి. తండ్రిపేరు నీలకంఠశాస్త్రి. నీలకంఠశాస్త్రికి సంగీతంలో ఉన్న పాండిత్యం మూలంగా గాంధర్వదేవుడని బిరుదనామం. ఆయన భార్య పార్వతి. కాజలో తల్లావఝల కుటుంబాలవారికి ఇప్పటికీ నారాయణతీర్థుల శ్రీ కృష్ణలీలాతరంగిణి యక్షగానంలోని, కనీసం మూడు తరంగాలైనా పాఠం చేయటం విధి. గోవింద శాస్త్రి బాల్యంనుండే సంగీత సాహిత్యాలలో గొప్ప ప్రతిభాశాలి, ప్రహ్లాదుని వలె అజన్మభక్తుడు,

ఏకసంథాగ్రాహి. ఆయన వాసుదేవశాస్త్రి అనే గురువు వద్ద సంస్కృత సాహిత్యం ఆపోశనం పట్టినారు. విద్యార్థిగా ఉన్నపుడు కూడ ఎక్కువ సమయం గ్రామం బయట ఒకచెట్టు నీడన ఏకాంతంగా భగవద్ధ్యానమగ్నుడై ఉండేవాడు. భక్తి రచనలు చేస్తూ తన్మయుడై పాడుకుంటూ గురుకులానికి ఆలస్యంగా వెళ్ళేవాడు. తోడివిద్యార్థులాతని పై కొండెములు చెప్పితే గురువు స్వయంగా పరీక్షించి ఆయన గొప్పదనం గుర్తించి మిగతా విద్యార్థులకు చెప్పినాడు. గోవిందశాస్త్రి 12 ఏండ్లు గురుకులక్లిష్టుడై సమస్త శాస్త్రాలు అభ్యసించినాడు. కృష్ణకు ఆవలి ఒడ్డున వేదాద్రి ఆయన అత్తవారిల్లు. ఒకసారి ఆయన భార్య పుట్టింటికి వెళ్ళింది. గోవిందశాస్త్రి మరునాడే ఆమె కోసం వేదాద్రికి పయనమైనాడు. కృష్ణానది దాటుతుండగా వరదలు వచ్చి ప్రాణాపాయం ఏర్పడింది. మానసికంగా ఆపత్సన్న్యాసం తీసుకున్నాడు. వెంటనే ఏదో వస్తువు చేతికి చిక్కింది. దాని సహాయంతో అవతలి గట్టుకు ఈది అత్తవారిల్లు చేరినాడు. అక్కడ అత్తకు అల్లుడుగాను, భార్యకు యతీశ్వరుడుగాను గోచరించినాడు. భార్య అడిగితే ఆతురసన్న్యాసం తీసుకన్న వైనం చెప్పినాడు. బిల్వమంగళుని భార్యవలె, తులసీ దాసు భార్యవలె, గోవిందశాస్త్రి భార్య సంసార జీవితంలోని హేయత్వము, పరమార్థజీవితంలోని మహత్వం మనసుకు నాటే విధంగా చెప్పింది. సన్న్యాసాశ్రమ స్వీకారానికి భార్య అనుమతి పొంది గోవిందశాస్త్రి స్వగ్రామం కాజకు వచ్చి తన భార్యను పోషించే భారం తమ్ముని కొడుక్కు అప్పగించి కాశీకి వెళ్ళినాడు.

కాశిలో ఆ దినాలలో రామానందతీర్థులనే ప్రసిద్ధ యతీంద్రు లుండేవారు. ఆయన గోవిందశాస్త్రి వైదుష్యం, భక్తి, వైరాగ్యాలకు తృప్తిపడి శిష్యుడుగా స్వీకరించి సన్న్యాసదీక్ష, నారాయణతీర్థులనే దీక్షానామం ప్రసాదించినారు. [రామానందులే శివరామానందులనీ ఆయన శ్రీకాకుళం వాడనీ, ఆయన అనుమతితో నారాయణతీర్థులు దక్షిణదేశం పర్యటించి కాశీకి పోయినాడని, ఒక మతం. గోవిందశాస్త్రికి పరిణామశూల ఉండేదనీ, కాజనుండి సింగరాయ కొండకు పోయి అక్కడ నరసింహస్వామికి 40 దినాలు ప్రదక్షిణలు చేసి వ్యాధి కుదుర్చుకొని అక్కడే తరంగాలు రచించి అద్దంకి సీమలోని 60 గ్రామాలవారికి ఆ తరంగాలు పాడటం నేర్పించినాడనీ, ఆయన శిష్యపరంపర ఇప్పటికీ అద్దంకిసీమలో ఉన్నారనీ, అక్కడినుండి బయలుదేరి అనేక నృసింహ తీర్థాలు పర్యటించి కంచిలో 1675 ప్రాంతంలో ఉండిన శివరామతీర్థుల వద్ద సన్న్యాసం స్వీకరించినాడనీ, శివరామానందుల రచన 'గురు చంద్రిక' అనీ, గురువుల ఆజ్ఞ మేరకు కంచినుండి నారాయణతీర్థులు కాశీకి పోయి అక్కడే సిద్ధి పొందినారనీ మరొక మతం]

కాశీలో నారాయణతీర్థులు గోపాల సరస్వతి అనే మరొక యతీశ్వరుని వద్ద వేదాంత గ్రంధాలు చదువుకున్నారు. కాశీనుండి దక్షిణాదికి వస్తూ గోదావరి జిల్లా కూచిమంచి అగ్రహారంలో మూడు సంవత్సరాలున్నారు. గుంటూరు జిల్లా వెల్లటూరులో ఉంటున్నప్పుడు శ్రీకృష్ణలీలా తరంగిణి అనే సంస్కృత యక్షగాన రచనం ప్రారంభించినారు. కృష్ణాజిల్లా కూచిపూడిలో ఉంటుండగా నారాయణతీర్థులను సేవించిన వారిలో సిద్ధప్ప ముఖ్యుడు. అతడే ఆశ్రమం స్వీకరించి సిద్ధేంద్రయోగియై కూచిపూడి నాట్య సంప్రదాయ ప్రవర్తకుడైనాడు. [నారాయణతీర్థులు తమ శ్రీ కృష్ణలీలా తరంగిణిలో "ఇతి శ్రీ శివరామానంద తీర్థ పాదసేవక శ్రీనారాయణతీర్థ విరచితాయాం" అని గురువులను స్మరించినట్లే "శివనారాయణతీర్థ సిద్ధానంద దాయకం" అని శిష్యుడైన సిద్ధేంద్రులను పేర్కొన్నాడని బాలాంత్రపు రజనీకాంత రావు గారి అభిప్రాయం. కాని ఈ సమాసంలోని సిద్ధ పదం శివనారాయణ తీర్థులకే అన్వయిస్తుంది. వారు గొప్ప సిద్ధ పురుషులని చాటుతుంది.] నారాయణతీర్థులు కాశీనుండి దక్షిణ దేశానికి పోతూ త్రోవలో పూరీ జగన్నాధం, శ్రీకాకుళం, శోభనాద్రి, వేదగిరి, క్షేత్రాలు దర్శించినారు. ఆయన దర్శించిన ఆయా దైవతముల ప్రసక్తి శ్రీకృష్ణలీలా తరంగిణిలో ఉన్నది. నామ సిద్ధాంత ప్రతిపాదకులైన బోధేంద్రులు అప్పటికే సిద్ధి పొందిన వార్త తెలిసి నారాయణ తీర్థులు తంజావూరు జిల్లా గోవిందపురానికి వెళ్ళి బోధేంద్రుల సమాధికి అంజలి ఘటించి నడుకావేరి చేరుకున్నారు.

నారాయణ తీర్థులవారు 1. శ్రీకృష్ణలీలా తరంగిణి 2. శాండిల్య భక్తి సూత్రం వ్యాఖ్య 3. భక్త్యధికరణమాల 4. హరిభక్తి సుధార్ణవం వంటి భక్తి రచనలే కాక 5. సాంఖ్యకారికావ్యాఖ్య 6. సాంఖ్యతత్త్వ కౌముదీ వ్యాఖ్య 7. న్యాయ కుసుమాంజలీ టీక 8. న్యాయముక్తావళీ టీక 9. భాట్ట భాషా ప్రాకాశం 10. యోగ సూత్ర వ్యాఖ్య 11. సిద్ధాంత బిందుః 12. లఘుచంద్రికా 13. వేదస్తవ టీక 14. వేదాంత విభావనా టీక 15. పంచకోశమంజరి వంటి వేదాంత న్యాయ శాస్త్ర గ్రంధాలు సంస్కృతంలోను 16. పారిజాతా పహరణం యక్షగానం తెలుగులోను రచించినారు. నారాయణతీర్థుల వ్యాఖ్యలు 'చంద్రికా' లాంఛితములు. శాండిల్య భక్తి సూత్ర వ్యాఖ్యలోను, భక్త్యధికరణ మాలలోను "శ్రీరామ గోవింద సుతీర్థపాద, కృపావిశేషాదుపలభ్య బోధం, శ్రీవాసు దేవాదధిగత్య సర్వ, శాస్త్రాణి వక్తుం కిమపి స్పృహానః" అని ఉండటం చేత నారాయణతీర్థులవారు రామగోవిందులనే శివరామానంద తీర్థుల వద్ద దీక్ష తీసుకున్నారనీ, వాసుదేవ శాస్త్రి వద్ద సమస్తశాస్త్రాలు అభ్యసించినారనీ, తెలుస్తుంది. శ్రీ నారాయణతీర్థులవారి శ్రీకృష్ణ లీలాతరంగిణి సంస్కృత

యక్షగానం, పారిజాతాపహరణం తెలుగు యక్షగానం తప్ప మిగతా కృతులన్నీ పండితైకవేద్యములు. పారిజాతాపహరణం తెలుగు యక్షగానం మేలట్టూరు భాగవతులకోసం చేసిన రచన. అది తంజావూరు అచ్యుతప్ప నాయక ప్రభువుకు (1561-1614) అంకితం; తీర్థులవారి భరతశాస్త్ర ప్రభృతి సర్వశాస్త్ర వైశారద్యానికీ సర్వతోముఖ ప్రతిభకూ దర్పణం. శ్రీకృష్ణలీలా తరంగిణి ఒక భక్తిరసమధుకోశం. అందులో భాష భావాలు లీలాశుకుల శ్రీకృష్ణకర్ణామృతాన్ని జయదేవుల గీత గోవిందాన్ని మరపిస్తాయి; ఆధ్యాత్మికతలో వాటికంటె మిన్న. 'బృందావన మధునా' ప్రభృతి తరంగాల్లో ప్రతిపాద్యమైన ఉపనిషదర్థం సకల వేదాంతసారం. సగుణ నిర్గుణ పరబ్రహ్మ తత్త్వాన్ని బోధించేశక్తి విద్యాశంకరుల తరువాత నారాయణ తీర్థుల వారికే అబ్బినదనీ, వాచస్పతిమిశ్ర మధుసూదన సరస్వతులను పాండిత్య ప్రజ్ఞా వైభవాల్లో మించినవారు నారాయణ తీర్థులే అని విజ్ఞుల అభిప్రాయం. శ్రీమద్భాగవతంలోని దశమస్కంధం పూర్వభాగం రుక్మిణీ కల్యాణం దాకా ఉన్న కథను 12 అంకాలుగా మలచిన యక్షగానం శ్రీకృష్ణలీలా తరంగిణి. యక్షగాన పద్ధతి ప్రకారం ప్రదర్శనకు అనుకూలంగా ఇందులో సంధి వచనాలు(గద్యలు) శ్లోకాలు కీర్తనలు దరువులు ఉన్నవి. ఇందులోని కీర్తనల సంఖ్య 156. పన్నెండు అంకాలు లేదా తరంగాలు భాగవతం 12 స్కంధాలకు ప్రతీక. ఒకప్పుడీ యక్షగానం 12 రాత్రులు ప్రదర్శించేవారట.

నారాయణ తీర్థులవారు గొప్ప కృష్ణ భక్తులు, సిద్ధపురుషులు, వారి మాహాత్మ్యం చాటే తీరుతీరు కథలు ప్రచారంలో ఉన్నవి. అందులో కొన్ని:-

1. నారాయణ తీర్థులవారు భక్తిపారవశ్యంతో సంకీర్తనం చేస్తుంటే శ్రీ కృష్ణ పరమాత్ముడు ప్రత్యక్షమయ్యేవాడట. గురువు రామానందులు ఒక కుటీరంలో, శిష్యులు నారాయణ తీర్థులు దూరాన వేరొక కుటీరంలో ఉండేవారు. శ్రీకృష్ణ పరమాత్ముడు సాక్షాత్కరించినపుడల్లా ఆయన కుటీరం వెలుగులు చిమ్ముతూ పరిమళాలు విరజల్లేది. తోడి శిష్యులకు నారాయణ తీర్థులపై ఏదో అనుమానం కలిగి గురువుగారి చెవి కొరికినారు. రామానందులు స్వయంగా పరీక్షింప దలచి ఒకరాత్రి శిష్యుని కుటీరానికి రహస్యంగా వెళ్ళినారు. నారాయణ తీర్థులు మైమరచి పాడుతూ అభినయిస్తుంటే కుటీరం రంధ్రం నుండి తొంగి చూచిన గురువు గారికి దివ్యప్రకాశం వెలుగులకు కనులు మిరుమిట్లుగొని చూపు పోయింది. ఆయన కండ్లు మూసుకొని కుటీరం బయటే చతికిల బడి తెల్లవార్లూ అట్లే ఉన్నారు. తెల్లవారి నారాయణ తీర్థులు బయటికి వచ్చి అక్కడ పడిఉన్న గురువుగారికి పాదాభివందనం

చేసి విచారిస్తే ఆయన తన కష్టదశ వినిపించి శ్రీకృష్ణ దర్శనం చేయించవలసిందిగా ప్రార్థించినారు. అనాడు నారాయణ తీర్థులు మరల శ్రీ కృష్ణ పరమాత్మను ప్రార్థిస్తూ గానం చేసినారు. పరమాత్ముడు సాక్షాత్కరించగానే గురువు గారిని అనుగ్రహించ వలసిందని ప్రార్థించినారు. శ్రీ కృష్ణ పరమాత్ముడు మురళీగానం చేస్తూ రామానందులకు దర్శనం ఇచ్చినాడు. రామానందులకు పోయిన చూపు వచ్చింది. రామానందులు అప్పటికప్పుడు ఐదు చరణాల గీతం పాడి పరమాత్మను స్తుతించినారు.

### ముఖారి రాగం - ఆది తాళం

1. గానం కురురే గోపాలం-బ్రహ్మానందం మురళీలోలం,
   నానాగమసార సిద్ధాంతరస-నవ్యనవనీతహారలీలం-చారుశీలమ్II

2. చందన చర్చిత సర్వాంగం, నవమందస్మిత రుచిరాపాంగం,
   కుంద కుసుమ వనమాలా రజధృత, మహనీయాంచిత సహసానంగమ్II

3. పరమహంస మానసవేద్యం, గోపబాలికా పంకజ హృదయం,
   కరుణ రసామృత కల్లోల లోచన, శ్యామలవేషం అనవద్యం కృష్ణII

4. సకల భువన జన సహకారం, సర్వ సమభావ భావాశ్రితా ధారం
   ప్రకటిత సనకాది భవ్యయోగి గమ్యం, అకలంకాకృతి విస్తరైక ధీరమ్II

5. శ్రీ మధురాపుర సంచారం, నీల శిఖిపించలాంఛిత శరీరం,
   రామానందతీర్థ రమ్య తపఃఫలం, రాధాకృష్ణ రూపరమణీయం కృష్ణII

పరమాత్మ సాక్షాత్కారం చేయించ జాలిన నారాయణ తీర్థులవంటి శిష్యుణ్ణి పొందిన రామానంద తీర్థులు ధన్యులు కదా!

2. నారాయణ తీర్థులు కూచిపూడిలో ఉంటున్నపుడు శిష్యుడు సిద్ధప్ప గమనించిన గురువుగారి మహిమ ఒకటున్నది. తీర్థులవారు పడుకొని తరంగాలు పాడుతుంటే బాలకృష్ణుడు ఆయన బొజ్జపై చిందులు త్రొక్కుతూ పాటలోని లయకు అనుగుణంగా నాట్యం చేసేవాడట. బాలకృష్ణుడు సిద్ధప్పకు కనబడేవాడు కాని తీర్థులవారికి కాదు. ఈసారి కనబడినపుడు తమకూ, శిష్యుడు సిద్ధప్పకూ జన్మరాహిత్యం ఎప్పుడో కనుగొమ్మని తీర్థులవారు శిష్యుని ఆదేశించినారు. మరునాడు కృష్ణదర్శనమైతే సిద్ధప్ప అడిగినాడు. పారిజాతాపహరణం యక్షగానం రచించి, కూచిపూడి వారిచేత పాడించి. ఆడించితే సిద్ధప్పకు ఇక జన్మ లేదనీ, కాని నారాయణ తీర్థులు ఇంకొక

జన్మ ఎత్తవలెననీ కృష్ణ పరమాత్ముడన్నాడట. రామానందులకు పరమాత్మ దర్శనం చేయించిన శిష్యుడు నారాయణ తీర్థులైతే, నారాయణ తీర్థుల కంటె ముందే జన్మరాహిత్యం పొందిన సిద్ధేంద్రుల గురుశిష్య పరంపర ఎంత గొప్పది!

3. రామానందుల అనుజ్ఞతో నారాయణ తీర్థులు తీర్థయాత్రలకు బయలుదేరి తిరుపతి కొండలు చేరేవరకు ఆయనకు దుర్భరమైన కడుపు నొప్పి లేచింది. తన్నివారణ కోసం దక్షిణ దిశగా పోవలసిందని అశరీరవాణి ఆదేశమైనది. తీర్థులవారు తంజావూరు జిల్లా నడుకావేరి గ్రామం చేరి ఆరాత్రి అచటి విఘ్నేశ్వరాలయంలో నిద్రించినారు. ఆయనకు స్వప్నంలో ఒక ఆదేశమైనది. మరునాడుదయం రెండు అడవి పందులు కనబడుతాయనీ వాటిని వెన్నంటి పోవలెననీ, అవి అదృశ్యమైన చోట నిలిచిపోతే కడుపు నొప్పి పోతుందనీ ఆస్వప్నంలోని సారం. మరునాడుదయం లేవగనే రెండు అడవి పందులు కనబడినవి. వాటిని అనుగమించుమన్నట్లు వినాయకుడు దిక్ నిర్దేశం చేసినాడట. ఈనాటికీ నడుకావేరి వినాయకుని చేతి వ్రేళ్ళు వరహూరు వైపు చూపిస్తూ కనబడుతాయి. తీర్థులవారు ఆ పందులను వెన్నంటి సాగిపోయినారు. తిరుపం దురుతి సమీపాన భూపతిరాజపురం అనే చోట పందులు అదృశ్యమైపోయినవి. భూపతి రాజపురానికి వరహూరని నామాంతరం. అగ్రామం పెద్దలకు కూడ ఒక మహాత్ముడు తమ గ్రామానికి వస్తున్నారనీ, ఆయనను గౌరవాదరాలతో ఆహ్వానించవలెననీ స్వప్నాదేశ మైనదట. వాళ్ళు తాళమేళాలతో ఎదురేగి తీర్థుల వారిని స్వాగతించి వెంకటేశ్వరాలయంలో నిలిపినారు. నారాయణ తీర్థులవారి కడుపు నొప్పి మటుమాయమై పోయింది. ఆయన వరహూరు వెంకట రమణుని ఈ విధంగా స్తుతించినారు.

*" వాసుదేవ వరాహపురి సన్నిధానే, శ్రీవెంకటాద్రి పతి రూప హరే మురారే,*

*నారాయణాఖ్యయతి దృష్టవరాహమూర్తే, నానా మునీంద్ర హృదయాలయ పాహి కృష్ణ II*

నారాయణ తీర్థులవారు వెంకటేశ్వరాలయంలో ఉంటూ శ్రీకృష్ణలీలా తరంగిణి పాడుతూ అభినయిస్తుంటె హనుమంతుడు తాళం వేసేవాడట. అక్కడ తీర్థులవారు తరంగాలు పాడే విధానం చాలా మందికి నేర్పినారు. "జయజయ గోకుల బాల" తరంగం పాడని భక్తులు దాక్షిణాత్యుల్లో ఉండరు.

తీర్థులవారు వరహూరులో మూడేండ్లుండి తిరుపందురుతికి వెళ్ళిపోయినారు. అది గొప్ప శివభక్తుడు జ్ఞానసంబందర్ దర్శించిన ప్రసిద్ధ క్షేత్రం. కర్ణాటక సంగీతం త్రిమూర్తులలో ఒకరైన త్యాగరాజులు (1767-1847) ఉపనిష ద్బ్రంహ్మేంద్రుల (1720-1800) ఆహ్వానంపై కాంచీపురానికి పోయి రచించిన రామ తరంగాలపై నారాయణ తీర్థులవారి ప్రభావం ఉన్నదని సంగీతజ్ఞులంటారు. త్యాగరాజుల గురువు శొంఠి వెంకట రమణయ్య. ఆయన తండ్రి వెంకట సుబ్బయ్య నారాయణ తీర్థులవారి శిష్యుడు. నారాయణ తీర్థులవారి శిష్యుల్లో గౌడ బ్రహ్మానందులు, కాశ్మీర సదానందులు, ఆంధ్ర మహేశ్వర తీర్థులు, బోధేంద్ర సరస్వతీస్వామి ముఖ్యులు.

నారాయణ తీర్థుల వారు తిరుపందురుత్తిలో ఒక మామిడి చెట్టు నీడన ధ్యాననిష్ఠలో ఉండేవారు. ఆ మామిడి చెట్టు సమీపాన దక్షిణ దిశలో వారు జీవసమాధి ఐనారు. అది తమిళ సౌరమానం మాసి నెల, శుక్లపక్షం, కృత్తికా నక్షత్రం. ఆంధ్రుల చాంద్రమానం ప్రకారం మాఘశుద్ధ అష్టమీ గురువారం. [నారాయణతీర్థులు శీర్ణమహాదేవి గ్రామంలో చాలాకాలం నివసించి కాశీకి పోయి తిరిగి వస్తూ కాజ, కూచిపూడి మొదలైన ప్రదేశాలు తిరిగి తిరుపందురుత్తి చేరి సమాధియైనారని తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి గారి అభిప్రాయం] వరహూరు వెంకటేశ్వరాలయంలో నారాయణ తీర్థులవారి చిత్రపటం ఈ నాటికీ దర్శనం ఇస్తుంది. అక్కడ వారు ప్రారంభించిన ఉట్ల పండుగ ఈ నాటికీ భాద్రపద మాసంలో జరుపుతుంటారు. వారి ఆరాధనోత్సవం ఆరుదినాలు తిరుపందురుతిలో వైభవంగా జరుపుతున్నారు. శ్రీ కృష్ణలీలా తరంగిణి ముగింపులో నారాయణ తీర్థులవారు పరమాత్మ అనుగ్రహం కోసం ప్రార్థిస్తారు. శ్రీ కృష్ణమేఘం నారాయణతీర్థులనే గిరిపై అనుగ్రహామృతం వర్షించేది. ఆ మధుర గానాన్ని ఆలపించే భక్తులపై ఈ నాటికీ కృష్ణ మేఘం ఆనందామృతపు జల్లులు కురుస్తునే ఉన్నది.

*ఆధారాలు:-*

1. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం, Vol. V-1966
2. The Saints of the Cauvery Delta-R. Krishnamurthy-1978.
3. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర-బాలాంత్రపు రజనీకాంత రావు-1975
4. Mahtmas, Acharyas, Mystics, Saints, Sages & seers - J. Krishnaji Trivedi - 1971
5. తెలుగు యోగులు-మేడపాటి వెంకటరెడ్డి-1987.

# శ్రీ వల్లభ చరితామృతం

హిందీ మూలం — తెలుగు

శ్రీ కళాధరభట్ — డా. తిరుమల రామచంద్ర

## పూజ, సేవ

**పూజ భక్తి కంటె వేరు :**

కర్మ జ్ఞాన భక్తి మార్గాలు మూడింటికన్నా పుష్టిమార్గం విభిన్నమైన నాల్గవ మార్గం. వల్లభ సంప్రదాయం భక్తి పద్ధతిని ప్రతిపాదించడం వల్ల పరిగణిత మవుతున్నప్పటికీ నూతన భక్తి పద్ధతిని ప్రతిపాదించడం వల్ల విశిష్టతను పరిరక్షించుకొంటున్నట్లే. ఈ సంప్రదాయంలోని ఆరాధన పద్ధతి (పూజాపద్ధతి) కూడ ఇతర సంప్రదాయాల ఆరాధన పద్ధతులతో సిద్ధాంతతః సర్వథా వేరైనది. ఆరాధన ముఖ్యంగా రెండు విధాలు - పూజ, సేవ అని. పూజ కర్మ మార్గానికి చెందినది. భారతదేశంలోని భక్తి సంప్రదాయపు దేవాలయాలన్నిటిలోను ప్రాయశః పూజాపద్ధతే ఉంటున్నది. పూజకు ఆధారం విధ్యుక్త కర్మ, సేవకు ఆధారం స్నేహం. పూజ విధ్యాత్మకం, సేవ స్నేహాత్మకం. వల్లభాచార్యులవారు 'పురుషోత్తమ' పదవాచ్యుడైన శ్రీ కృష్ణ భగవానుని ఆరాధననే భక్తిమార్గంగా అంగీకరించారు. శ్రీకృష్ణాతిరిక్త దేవతల, విభూతి స్వరూపాల ఆరాధన ఎన్నటికిని భక్తిమార్గీయం కాదు. వల్లభమతంలో అది కేవలం పూజామార్గీయమే. అందువల్ల పూజ విభూతి పరత్వం కావడం వల్ల కర్మ మార్గీయమే అవుతున్నది. శుద్ధపుష్టిమార్గంలో ఆరాధన పురుషోత్తముడైన కృష్ణునితో పర్యవసించడం వల్ల సేవ అని వ్యవహృత మవుతుంది. అందువల్ల పూజ కర్మ మార్గీయం, సేవ పుష్టి మార్గీయం.

పూజా మార్గంలో సాధనం, ఫలం వేరువేరుగా పరిగణింపబడుతాయి. సాధనం, ఫలం ఒక్కటే అని నిర్దేశించేది సేవా మార్గం. అందువల్ల భక్తి ద్వారా భక్తి ప్రాప్తిస్తుందని అంటారు. ఇక్కడ భక్తే విధానం, భక్తే ఫలం. 'భక్త్యానం జాయతే భక్తిః' భక్తి అనే మాటలో ధాత్వర్థం సేవ, ప్రత్యయార్థం స్నేహం. "ధాత్వర్థః సేవా ప్రత్యయార్థః స్నేహః". ఈ విధంగా సేవ అనే పదం భక్తి, స్నేహాలు రెండింటికీ పర్యాయం. నిజానికి

స్నేహమే భక్తి కదా. "స్నేహో భక్తి రితి ప్రోక్తః" - అని నారద వాక్యం. భగవంతుని ఎడల పరమానురాగమే భక్తి అని శాండిల్య భక్తి సూత్రం చెబుతున్నది. 'సా పరమానురక్తి రీశ్వరే'. జ్ఞానపూర్వకమైన స్నేహం విహితస్నేహం అని అంగీకరించారు. ఈ విహిత స్నేహమే భక్తిపదవాచ్య మవుతున్నది. దీనినే వల్లభాచార్యులవారు మర్యాదా. శాస్త్రీయ మొదలయిన పదాలతో వ్యవహరించారు. అవిహితస్నేహం స్వయంగా పుష్టిభక్తి. వల్లభ సంప్రదాయంలో 'సేవ' అనే దానిని ఈ అర్థంలోనే ప్రయోగిస్తారు. భక్తి మార్గీయ, పుష్టి మార్గీయ సేవలలో ఇంతటి తారతమ్య మున్నది.

పూజ సార్వజనికం, సేవ వ్యక్తిగతం.

ఈ విధంగా వల్లభాచార్యులవారు అవిహిత స్నేహమే సేవ అన్నారు.. 'భక్తి శాస్త్రీయా ఆంతర ప్రేమ సహితా సేవా'. 'స్నేహ ఏవ మయిన నతు కృతిః' అనే సుబోధినీ వ్యాఖ్యలోని వాక్యాలలో 'స్నేహ' అనే పదంతో సేవను, 'కృతి' అనగా విధి అనే పదంతో పూజను నిర్దేశించారు. పూజ విధికి సంబంధించింది గనుక సార్వజనికం, సేవ స్నేహం కావడం వల్ల వ్యక్తిగతమైనది. దాని రసమయత దానిని గోప్యంగా ఉంచడంలోనే ఉంది. 'రసో గుప్త ఏవ రసత్వ మా పద్యతే' - సుబోధిని. అగుప్తరసం రసం కాదు, రసాభాస మవుతుంది. 'అగుప్తోరసో రసాభాసః స్యాత్'. - సుబోధిని. అందువల్ల దేవాలయ పద్ధతి పూజామార్గంలోనిది. సేవా మార్గమని వ్యవహరింపబడే పుష్టిమార్గంలో దేవాలయాలు, మందిరాలు లేవు. ఈ కారణంగానే పుష్టిసంప్రదాయంలో దేవాలయాలు, మందిరాలు వంటి సంస్థలు అంగీకరించబడవు. వల్లభ సంప్రదాయంలో ఆచార్యకులం వంశం వారి ఇల్లు 'నందాలయం'. దానిలోనే వల్లభ సంప్రదాయానుయాయులు బాలకృష్ణుని సేవ చేస్తారు. వారి సేవకుల ఇల్లు అతని సేవ్యుడైన భగవంతుని మందిరం. అక్కడ కూడా అతడు ఏకాంతంలో భగవత్సేవలో తత్పరుడౌతాడు. అందువల్ల వల్లభ సంప్రదాయుల దేవాలయాన్ని సార్వజనిక దేవాలయ మనడం ఈ సంప్రదాయపు ధార్మిక భావనకు సర్వథా ప్రతికూలం. ఇది ఒక వ్యక్తి సొంత ఇంటిని 'సార్వజనిక'మని ఉద్ఘోషించడం వంటిది.

వల్లభులు సేవను ఎప్పుడూ 'సార్వజనిక' మని అంగీకరించలేదు. వారు ఈ 'సార్వజనికతలను' ప్రతిఘటిస్తూ, సామూహిక సేవ మొదలైనది. ఈ మార్గభావనకు మూలతః ప్రతికూలమని, అందువలన అసంగతం, మరిన్నీ అసంభవం అని స్పష్టంగా

ఆదేశించినారు. 'సాముహిక గ్రహణ భావనాద్యనుపపత్తేః' - సుబోధిని. వల్లభుల సుబోధినిలో మరొకచోట ఉన్న ఈ అభిప్రాయాన్నే వారి పౌత్రులు శ్రీవల్లభులు తమ లేఖల ద్వారా అత్యంత స్పష్టంగా చెబుతూ కర్మమార్గం (పూజామార్గం) వినా మరొక చోట, అనగా పుష్టిమార్గంలో సేవ 'సార్వజనికం కాదు' అని తెలిపినారు. 'కర్మమార్గేజ్యోన్యత్ర భక్తిమార్గే భజనం లోకప్రసిద్ధం నభవతి' - సుబోధిని. 'భజనం' అనేది సేవకు పర్యాయం. 'భజనం సేవైన' - సుబోధిని. వాస్తవంగా చూస్తే, వల్లభులు 'పూసాపె'ను (పూజకర్మను) తమ సంప్రదాయంలో మూలతః దోషావహంగాను, భక్తికి బాధకంగాను చెప్పారు. 'నహి పూజనేస్య మహత్త్వం ప్రత్యుత తద్బాధకం' - సుబోధిని. సర్వజన పూజితుడయ్యే యోగి కూడ యోగసిద్ధికి అయోగ్యుడవుతాడు. 'జనేనాభిమతో యోగీ యోగసిద్ధిం నవిందతి' అన్నప్పుడు, సేవ సార్వజనిక మంటే, వల్లభ సంప్రదాయ మహత్త్వానికి, తద్గత సిద్ధాంతానికి చరితార్థత ఎక్కడిది?

ఫలావా ఫలం కావాలనేది పూజకు హేతువు. కాని, సేవ సాక్షాద్భగవంతుని కృపాఫలంగా అంగీకృతమైంది. పూజ ఫలప్రాప్తికి సాధనము, హేతువూను. సేవ సాధనమూ, సాధ్యమూనూ. 'అర్చనాయాం ఫలం హేతుః, సేవాచ పుష్టిమార్గే సస్నేహ కృపాఫలం చైతత్' - సుబోధిని. సేవలో సేవ్యుని సంపూర్ణ సుఖం కోసం స్నేహపూర్వకంగా పట్టుదల చూపడం ఉంటుంది గనుక సేవ్యునికి ఇష్టమైన, అతనికి అనుకూలమైన పరిచర్యాపద్ధతే ఉంటుంది. వేసవిలో వట్టివేళ్ల మొదలయిన సుగంధద్రవ్యాలతో సురభిలమైన శీతలజలమే 'సేవ్యు'నికోసం ఉపయోగించబడుతుంది. చలికాలంలో స్నిగ్ధమధురాలయిన లవణభూయిష్ఠమైన వ్యంజనాలు నివేదించాలనే పద్ధతి ఉంది. సేవ్యుని సమ్ముఖంలో సంగీతంకూడ ఋతు కాలానుసారంగా ప్రస్తావించడం జరుగుతుంది. వాస్తవంగా సేవోపయోగకరమైన ప్రతి వస్తువు వల్లభసంప్రదాయంలో అలౌకికంగా (దివ్యంగా) భావించబడుతుంది. 'పుష్టిమార్గంలో సేవాపద్ధతి, సంవత్సర, దిన ఉత్సవాలు, నిత్యసేవాపద్ధతి, సామాగ్రి, ఆభరణాలు, వస్త్రాలు, సింహాసనం, పెరడు, సొంత ఇల్లు, వంట యిల్లు, నీళ్ల యిల్లు, పూవులగది, కూరగాయల గది, సామాగ్రి భండారం, చౌకా, సేవకులు, కీర్తనలు పాడేవారు, పరిచారకులు, మొదలైన సేవాసంబంధమైన సకలః పదార్థమూ దివ్యమని భావించండి. వీటిని భావనాత్మకంగా భావించండి. వీటిని లౌకికమని అనుకుంటే మహాపరాధమౌతుంది. ఈ భావం మనస్సులో దాచుకోండి' - భావభావన అనే గ్రంథం.

నిజానికి, వల్లభ సంప్రదాయంలో సేవోపయోగకరమైన ప్రతి వస్తువు భావనావిశేషంతోనే భగవంతునికి సమర్పితమౌతున్నది. ఉదాహరణకు ధూపం గృహస్వామిని శ్వాసోఛ్ఛ్వాసాల సుగంధరూపం, పూవులలో వ్రజభక్తుల భావనలున్నాయి. అందువలన సేవావిధితో సేవోపయోగి సామగ్రి కేవలం 'ఉపకరణం' కాదు, పూజలో ఇలాటి భావన లేకపోతే, పూజాసామగ్రి కేవలం ఉపకరణాలే అవుతాయి. పూజవిధిలో పూజకుడు తన మనస్సుకు నచ్చిన పూవులు, పక్వాన్నాలు, సామగ్రి, ఆభరణాలు మొదలైనవి ప్రతిమకు నివేదిస్తాడు. పూజాపద్ధతిలో పూజాసామగ్రిని 'సంపాదించడం' పూజలో అంతర్భాగంగా ఎప్పుడూ భావింపబడదు. పూజకోసం బావినీరు తేవడమనే పని పూజకాదు. సేవాపద్ధతిలో ఈ పనికూడ సాక్షాత్తు 'సేవ'గా భావించడం జరుగుతుంది. సేవలో సేవ్యుడి యెడల సేవకుడు (పూజకుడు) చూపించే ప్రతి మనోవాక్కాయ చేష్టసేవే అవుతుంది. వల్లభులు కృష్ణుని సేవను సర్వభావంతోను చేయాలని ఆదేశించారు. 'మనోవాగ్దేహైః కృష్ణః సేవ్యః' - ప్రకాశ. సర్వభావంతో అనుష్ఠించినపుడే సేవ చరితార్థమౌతుంది. 'సర్వభావేన సేవా' - సుబోధిని. 'దేహేంద్రియ ప్రాణాలు, వాటి వ్యాపారం, అంతఃకరణాది సర్వమూ భగవంతునిదే. నాదికాదు' అనే భావననే సర్వభావం అంటారు.

స్తోత్ర, నమస్కార నమ్రతాది పరిచర్యను, ధూపదీపోపహారాది సామగ్రితోను పూజావిధి పరిసమాప్తమౌతుంది. 'ధూపం దీపం ఉపహారః పూజాయాం సాధనత్రయం నిర్దిష్టం. ఇయం పూజా స్తోత్రనమస్కారప్రహ్వీభావాత్మికా' - సుబోధిని. సేవాపద్ధతిలో భగవంతునికి చేసే సర్వ పరిచర్య సేవలో అంతర్గతమౌతుంది. భగవంతునికి చేసే వస్త్రప్రక్షాళన కర్మ కూడ సేవే. 'సర్వ పరిచర్య' సేవ అనబడుతుంది. గుడ్డలు ఉతకడం కూడ సేవే' - భావభావన. అతిబహిరంగతే సేవ. శుద్ధ పుష్టిమార్గీయ సేవకు సదృశమైన సేవామార్గంలోనూ అక్కడక్కడ వస్త్రాలంకారాది సమర్పణ పద్ధతి కనిపిస్తుంది. కాని ఈ పద్ధతి విభూతి పరత్వం (విగ్రహారాధనకు సంబంధించింది) కావడం వల్ల పూజామార్గీయమే అవుతుంది కాని, భక్తిమార్గీయం కాదు.

పూజామార్గంలో పూజ విభూతి పరం కావడం వల్ల ప్రతిమకు సమర్పించిన నైవేద్యం స్వీకరించడం నిషిద్ధంగా పరిగణితమైంది. ఇది ఎంతవరకు వచ్చిందంటే, ప్రతిమ సమక్షంలో పెట్టిన దీపాలను తక్కిన పనులకు ఉపయోగించ వీలులేదు. ఈ

సిద్ధాంతం సేవామార్గంలో మాననీయం కాదు. ఈ మార్గంలో మొదట భగవంతునికి సమర్పించిన దానినే స్వీకరించాలని చెప్పబడింది. భగవంతునికి సమర్పితం కాని వస్తువును ఉపయోగించడం సర్వథా నిషిద్ధమని భావిస్తారు. భగవంతునికి సమర్పించిన వస్తువును ఎప్పుడు కూడ ఉపయోగించవద్దని వల్లభులు ఆదేశించినారు. భగవంతునికి సమర్పించిన వస్తువులను ఉపయోగించరాదనే నిషేధం భిన్నమార్గీయుల అభిప్రాయం. సేవామార్గీయులది కాదు. 'అసమర్పిత వస్తూనాం తస్మాద్వర్జన మాచరేత్ నగ్రాహ్యా మితి వాక్యం హి భిన్నమార్గ పరం మతమ్' - స.ర.

పూజ పరిశుద్ధి దేశ, కాల, ద్రవ్య, కర్తృ, మంత్ర, క్రియల పరిశుద్ధిపై ఆధారపడి వుంటుంది. సేవాపద్ధతిలో దేశకాలాదులు ఎంతమాత్రమూ శుద్ధికి కారణం కానక్కరలేదు. 'సద్యః శుద్ధిః ఇతి శుద్ధి హేతూనాం దేశాదీనాం నిరపేక్షతా మాహ' - సుబోధిని. సేవలో నిరంతరత ఉన్నందున కాలనియామకమనేది ఉండదు.. 'అత్ర కాలో ననియామకః' - సుబోధిని. పూజలో కాలం వల్ల కలిగే ప్రతిబంధం ఉంటుంది. సహజం, దేశకాలోదితం, లోకవేద నిరూపితం, సంయోగజం, స్పర్శజం అనే పంచదోషాల నివృత్తి భూతశుద్ధి మొదలైన పద్ధతితో కలిగినప్పుడే పూజాపద్ధతి నిర్దోషమవుతుంది. అన్యథా దోష సహితమే. సేవాపద్ధతిలో మొట్టమొదట ఈ దోషాలు ఉన్నట్టే ఒప్పుకోవడం లేదు. మీదుమిక్కిలి ప్రతికూల మనుకున్న పదార్థాలు సేవాపద్ధతిలో సానుకూల మవుతాయి. స్నేహంలోని 'అద్భుతత్వం' ఇదే!!! 'స్నేహేన బాధితార్థా అపి ప్రయోజకా భవంతి' - సుబోధిని. (ఈ వాక్యం ఎంత మనోహరంగా ఉంది!)

పుష్టి మార్గంలో అనగా పరిశుద్ధ స్నేహమార్గంలో బ్రహ్మసంబంధపూర్వకంగా సర్వస్వమూ భగవంతునిలో వినియోగమవుతుంది. అందువలన 'సర్వస్వము' ఈ విధంగా భగవదీయం అయినపిదప - భగవత్సంబంధి అయిన పిదప - దానిలో మరి దోషప్రసక్తి ఎక్కడిది? భక్తి అనగా పరమస్నేహం స్వతః సకలదోషాలను తొలగిస్తుంది. 'భక్తిః పునాతి మన్నిష్ఠాన్' - భాగవతం.

పూజామార్గంలో ప్రతిమలోపల దేవతను ఆవిర్భవింపజేయడం, తిరోభవిపజేయడం జరుగుతాయి. 'దేశకాలాది మధ్యస్థః షడంగత్వం య అగతః' - సుబోధిని. అర్థాత్ 'మూర్తౌ విసర్జన వికల్పాత్ ఆవిర్భావ తిరోభావానామ్' - లేఖ. విగ్రహంలో ఈ ఆవేశింపజేయడం సాకారంగా భావింపబడుతున్నది. సేవామార్గంలో

ప్రతిమను సాక్షాత్తు భగవత్స్వరూపంగా భావిస్తారు. ప్రతిమ వేరు, దానిలో భగవంతుడు విడిగా ఆవాహన అవుతాడు - అనడాన్ని అంగీకరించరు. ప్రతిమ సాక్షాద్భగవత్స్వరూపమే.

పూజామార్గంలో మంత్రోచ్చరణ పూర్వకంగా, విగ్రహంలో వున్న ఆయా దేవతల ఆరాధన జరుగుతుంది. పుష్టి మార్గంలో నైతే, విగ్రహం విగ్రహం కాదు, సాక్షాత్పూర్ణ పురుషోత్తముడు, కనుక ఈ భావంతోనే దానికి సేవ జరుగుతుంది. అనగా, పూజామార్గంలో విగ్రహాలలో వేద మంత్రోచ్చరణ పూర్వకంగా ఆయా దేవతల ప్రాణ ప్రతిష్ఠ మొదట జరుగుతుంది. అప్పుడే అది పూజకు యోగ్యమవుతుంది. పూజలో ప్రతిమలో దేవత ఆవిర్భావం జరుగుతుంది. కాని, సేవాపద్ధతిలో పరుసవేది తాకిడికీ తామ్రం బంగారయినట్లు పురుషోత్తమస్వరూపుడైన గురువుగారి స్పర్శ మాత్రంచేతనే ప్రతిమ సాక్షాత్పురుషోత్తమ రూప మవుతుంది. ఇంట్లో ప్రవేశించే వ్యక్తి ఇంటిలోపలి నుంచి వెలుపలికి కూడా పోగలడు. అదేవిధంగా విగ్రహంలో ప్రవేశం పొందిన దేవత విసర్జన విధితో బంగారమయిన తామ్రం మరల ఎప్పటికిని తామ్రం కాదు, బంగారుగానే వుంటుంది. ఆవిధంగానే పురుషోత్తమ రూపంలో వున్న ప్రతిమ సేవామార్గంలో పురుషోత్తముడుగానే ఉంటుంది. 'మూర్తౌ భగవతోజ్ఞానం సాకారావేశతో మతః, భక్తి మార్గ ప్రకారేణ జ్ఞానతస్తు తదాత్మనా పూజామార్గే. భవే న్మంత్ర విధానాత్ పూజ్య సేవనమ్, విశేషో భక్తి మార్గోయం పురుషోత్తమ రూపిణః మణిస్పర్శేన తామ్రాది సౌవర్ణమివ తత్త్వతః, అతస్తత్ర కృతం సర్వం సాక్షాత్ కృష్ణేకృతం భవేత్ - శ్రీహరి మహాప్రభు.

లోకంలో ఒక సేవకుడు తన యజమానునికి ఏ విధంగా సేవ చేస్తాడో, ఆ విధంగానే పుష్టిమార్గంలో భగవంతునికి పరిచర్య జరుగుతుంది. అందువల్ల సేవలో లౌకికయుక్తి, స్నేహమూ ముఖ్యమైనవి. వాస్తవానికి సేవలో స్నేహమే నియామకం. తల్లి ఏవిధంగా తన పుత్రుణ్ని స్నేహంతో ముద్దుచేస్తూ పాలించి పోషిస్తుందో సేవలోను ఈ విధమయిన పరమానురక్తి అనువర్తిస్తుంది. పూజ శాస్త్ర నియమితం. పూజలో శీతల జలాలతోనే ప్రతిమకు అభిషేకం చేయాలనే పద్ధతి వుంటే, తదనుసారంగానే విధి ఉంటుంది. కాని, పుష్టి మార్గంలో శిశిర ఋతువులో బాలప్రభువుకు శీతబాధ ఉండరాదనే స్నేహాతిశయ భావంతో వేడి నీటిని అభిషేకానికి వాడడం జరుగుతుంది. అందువల్ల పూజామార్గంలో విధి ముఖ్యం గనుక విధి స్నేహసహితమా, స్నేహరహితమా

అనే ఆలోచన ఉండదు. విద్యాచరణమే ప్రధానమని భావించి, విగ్రహానికి ఆరాధన జరుగుతుంది. సేవలో విధి కాక స్నేహమే ఉత్తమమమని భావించబడింది. 'విధి స్నేహయోః స్నేహో బలిష్ఠః' - సుబోధిని. వస్తుతః సే ో భావానికే ప్రాధాన్యం, సాధనాల అవసరం లేదు. పూజామార్గంలో సాధనాలు ముఖ్యం, భావం అనివార్యమేమీ కాదు. 'భావో భావనయా సిద్ధః సాధనం నాన్య దిష్యతే' - సం.ని.

"పుష్టిమార్గ పద్ధతిలో భావంతో భగవంతుడు దయచేస్తాడు. మర్యాదామార్గంలో వేదమంత్రాలతో అవాహనం ఎలా జరుగుతుందో, ఆ విధంగానే పుష్టిమార్గంలో భాగవతుల భావంతో భగవంతుడు ఆవిర్భవిస్తాడు." పూజామార్గంలో భిన్నమైన (విరిగిన) విగ్రహం అరాధనకు పనికిరాదని భావిస్తారు. పుష్టిమార్గంలో అలా కాదు." ఒక ప్రతిమను నిర్మించినప్పుడు దానిని కాదనరాదు. ప్రతిష్ఠ కాకపోతే ఎక్కడ పోయింది. ప్రతిమను భావనతోనే చేయాలి." - 252 వైష్ణవ వార్త.

(సశేషం)

# భూతదయ

**శ్రీ జి. శ్రీశైలం**

ఒకాయన ఓ రోజు గోవులకు ప్రత్యేకించి అరటిపళ్ళను పెడుతుంటే చూశాను. ఎందుకు అరటిపళ్లను పెడతాడా విధంగా అని ఆరోజంతా ఆలోచించాను. పాలను ప్రసాదించు దేవతలను భావం తళుక్కున మెరిసింది. అసలు రహస్యం తెలిసినట్లైంది. బహుశా ఆ వ్యక్తి కూడా ఈ విషయం తెలుసుకునే వాటిని ఆరాధిస్తున్నాడని అనుకున్నాను. కనీస ధర్మంగా నడుచుకోవడం అంటే ఈ ప్రకారంగానే వుంటుందనుకున్నాను. అధర్మంగా నడుచుకునే మనుషులకు చిరుతిండ్లు తినిపించే కన్న దయను పెంచుకుని గోవులకు గేదెలకు తోచినంత సహకరిస్తే ఫలితం దక్కుతుందని దృఢనిశ్చయానికి వచ్చాను. దైవసాక్షాత్కారానికి ఈ భూతదయ మెట్టు కాగలదని భావించాను. హైందవసారం బాటలో వాటిపట్ల నేటి కఠోర కసాయితనం చెదరిపోవాలని విధిని ప్రార్థించాను.

# విశ్వగురు సందర్శనం

**శ్రీ జి.వి.యల్.యన్. విద్యాసాగరశర్మ**

భగవంతుడు సృష్టిస్థితి లయాత్మకమైన మనోశక్తి. దానికి ఒకపేరు లేదు. రూపం లేదు. గుణం లేదు. అది అవ్యయం. నిరంజనం. విశ్వవ్యాపకం. విశ్వాత్మకం. శుద్ధచైతన్యం. ఆ మహాశక్తిని (కాన్షియస్ ఎలక్ట్రో మాగ్నటిక్ పవర్‌ను) తమలో నింపుకొన్న వాళ్ళందరూ భగవత్స్వరూపులే! ఆ శక్తికే మనం రకరకాల పేర్లు పెట్టి, పరాశక్తి అనీ, పరబ్రహ్మ అనీ, పరమాత్మ అనీ, సదాశివుడనీ, నారాయణుడనీ, దత్తాత్రేయుడనీ పిలుస్తున్నాం. ఇతర మతాలకు సంబంధించినవాళ్లు వాళ్ల వాళ్ల సంప్రదాయానుసారంగా ఆ శక్తిని అల్లా అనో, మరొకటనో పిలుస్తున్నారు. ఎవరే పేరుతో పిలచినా, ఏ మార్గాన్ని అనుసరించినా పలికే దేవుడు ఒక్కడే! అందరూ చేరుకొనే గమ్యం ఒక్కటే!

"ఈ సమస్త విశ్వాన్నీ 72 మంది పరమగురువులు పాలిస్తున్నారు. వాళ్లలో 5గురు ప్రధానమైనవాళ్లు. ఆ ఐదుగురిలో ఉన్నతోన్నతమైన స్థానంలో ఉన్నవారు శ్రీ షిర్డీసాయిబాబా" అంటారు మెహర్‌బాబా. ఆదిగురువైన (పరబ్రహ్మ స్వరూపమైన) దత్తాత్రేయప్రభువే "సాయి"గా అవతరించారని వారి ఉద్దేశ్యం. "సాహి" శబ్దభవమే "సాయి". సాహి - అంటే ప్రభువని అర్థం. ఈ సమస్త విశ్వాన్నీ పాలించే ప్రభువు ఒక్కడే. ఆ ప్రభువే (పరబ్రహ్మ) సాయి. సాయినాథుని జీవితాన్ని, వారి లీలలనూ గమనిస్తే ఈ విషయం సత్యమే నని మనకు బోధ పడుతుంది. తాను చిచ్ఛక్తి స్వరూపమైనప్పటికీ, అందరికీ అన్నీ ఈయగల సర్వసమర్థు డైనప్పటికీ, తానందుకొన్న ఆధ్యాత్మికస్థాయి నుండి కిందికి దిగి వచ్చి, మామూలు మనిషిలా మసలుతూ, ఇంటింటికీ తిరిగి బిచ్చ మెత్తుతూ, 'అల్లామాలిక్' అంటూ, తాను సముపార్జించిన శక్తిని మతసమైక్యతకూ, మానవకల్యాణానికీ ధారపోసిన పరమ కారుణ్యమూర్తి ఆయన. ఆయన మానవాళికి మార్గదర్శి. అంతటి ప్రేమమూర్తి, అంతటి త్యాగమూర్తి మరొకరు మనకు కనిపించరు. అంతటి సద్గురువు అంతగా సమాజం క్షేమాన్ని కాంక్షించిన దయాళువూ మరొకరు కనిపించరు.

దత్తాత్రేయులవారితో "గురుసంప్రదాయం" అనేది మన భూమిమీదకు

వచ్చింది. జ్ఞానప్రదాతలందరూ దత్తాత్రేయ స్వరూపాలుగా, గురుస్వరూపాలుగా లోకం సంభావిస్తుంది. దత్తాత్రేయులవారి దగ్గరనుంచి ఈ గురు సంప్రదాయం, పరంపరగా, అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ వస్తున్నది. ఈ గురుసంప్రదాయం మనలోకంలోనే కాదు, ఊర్ధ్వలోకాల్లోకూడా ఉంది. రామకృష్ణపరమహంస జీవితచరిత్ర, ఒక యోగి ఆత్మకథ, థియొసాఫికల్ గ్రంథాలు మొదలైనవి పరమగురువులను గురించి పేర్కొంటున్నాయి. ఒకవిధంగా చూస్తే ఈ లోకాన్ని పరిపాలిస్తున్నదీ, తమ శక్తితో ప్రభావితం చేస్తున్నదీ పరమగురువులేననిపిస్తుంది. వాళ్లు చేసే పనులన్నీ కొన్ని రూల్సుకూ, రెగ్యులేషన్సుకూ లోబడి ఉంటాయి. వాళ్లు తరచుగా సమావేశమౌతూ లోకకల్యాణం కోసం ఏం చెయ్యాలో చర్చిస్తూ, కొన్ని నిర్ణయాలు చేయటం జరుగుతోంది. ఆ నిర్ణయాను అమలు చేసేటందుకు వాళ్లల్లో కొంతమంది ఈ భూమిపై జన్మిస్తుంటారు. ఆ గురుస్వరూపాలకు కావలసిన శక్తియుక్తులన్ని పరమగురువులు ప్రసాదిస్తూ నిర్ణీత కార్యక్రమం విజయ వంతంగా నిర్వహించేటందుకు వాళ్లను సంసిద్ధం చేస్తుంటారు. సమాజంలో అలా అవతరించిన ఆ దివ్యులనే అవతారపురుషులుగా, మహాత్ములుగా, సిద్ధపురుషులుగా, యోగులుగా, సద్గురువులుగా లోకం భావిస్తూ ఉంటుంది.

"లోక" మంటేనే అర్థకామస్వరూపం. అర్థకామస్వరూపమైన ఈ లోకాన్ని పారలౌకికమైన మోక్షంతో సమన్వయించడానికే అవతారాలు వస్తుంటాయి. ఐహికాముష్మికాలను సమన్వయపరచే సూత్రం "ధర్మం". ధర్మం ఒక ప్రత్యేకమైన పురుషార్థం కాదు. అర్థ కామ మోక్షాలన్నవి మూడే అసలు పురుషార్థాలు. కామాన్ని తెలియజెప్పడానికి రామాయణం, అర్థవిషయాన్ని బోధించడానికి భారతం, మోక్షవిషయానికి భాగవతం వెలువడ్డాయి. మరొక పురుషార్థం లేదు. మనకు మరొక గ్రంథం లేదు. ఆ మూడు పురుషార్థాలను ధర్మం సమన్వయపరుస్తూ ఉంటుంది.

లోకాన్ని ఒక సరళరేఖగా మనం భావించినట్లైతే దానికి మొదటి బిందువు అర్థం. చివరి బిందువు కామం. ఈ సరళరేఖకు పైన, ఊర్ధ్వంగా ఉన్న బిందువు మోక్షం. ఇది ఒక త్రికోణం. ఈ మూడు బిందువుల్ని కలుపుతూ ఒక వృత్తం గీస్తే అది ధర్మమౌతుంది. ఆ వృత్తాన్ని పరిరక్షించే బాధ్యత అవతారానిది. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అన్న వాక్యంలోని అంతరార్థం ఇదే! అంటే - అర్థ కామాలను ధర్మ విరుద్ధంగా అనుభవిస్తూ, మోక్షపథ ప్రవర్తకులు కావటమే లోకుల పని. అట్లా

కానినాడు లోకాన్ని క్రమబద్ధం చెయ్యటానికి అవతారపురుషులు వస్తారు. లోకానికి మార్గదర్శకులౌతారు.

అవతారం అంటే ఏమిటి? శ్రీ విశ్వంజీ మాటల్లో చెప్పాలంటే "భగవంతుడు ఎక్కడో వైకుంఠంలో పరివేష్ఠించి ఉంటే, సమస్త దేవతలూ, మునులూ, సిద్ధులూ ఆయన్ను భూమిమీదకు అవతరించామని ప్రార్థిస్తే, ఆయన భూమిమీదకు దిగివచ్చాడనుకోవటం పొరబాటు. ఆయన అవతరించిన విధానం వేరే ఉంది.

భగవంతుడంటే సాకారం కాదు. నిరాకారం. శక్తిస్వరూపం. శుద్ధచైతన్యం. భగవంతుని మనం విశ్వవ్యాపకమైన, సర్వశక్తిసమన్వితమైన శుద్ధచైతన్యంగా తలచినట్లైతే విశ్వమనస్సుతో అనుసంధానం చేయగల సిద్ధపురుషులూ, యోగులూ, భక్తులూ వారివారి మానసిక శక్తులను సమ్మిశ్రమం చేసి, అంతటా ఉన్న ఆ పరమాత్మ శక్తితో అనుసంధానం చేసి, అట్లా చెయ్యగా వచ్చిన ఒక అసాధారణ మానసిక ప్రజ్ఞను ఒక వ్యక్తియందు నిక్షిప్తం చెయ్యడం. అంటే విశ్వప్రాణ ప్రతిష్ఠ చెయ్యడం - అవతారం."

ఆ విధంగా వచ్చిన అవతారమూర్తికి విశ్వమనస్సుతో మానసికంగా ఎప్పుడూ సంబంధం ఉంటుంది. అంతకంటే మించి, విశ్వమనస్సుతో సంబంధం పెట్టుకోవడం చాతగాని వ్యక్తిగత మనస్సుతో గూడా ఆయన సంకల్పిస్తే సంబంధం పెట్టుకోగలడు. అనుభూతుల నందివ్వగలడు. తన సంకల్పమాత్రం చేతనే, ఏవ్యక్తిలోనైనా, ఏపరిణామాన్నైనా తీసుకోని రాగలడు. ఇదంతా చూస్తే, విశ్వమంతా పాలిస్తున్నది విజ్ఞాన తరంగమయమై విరాజిల్లుతున్న విశ్వమానసతరంగాలేననిపిస్తుంది. ఆ విశ్వమానసతరంగాలే విశ్వాన్ని వినోదింపజేస్తూ, విలాసంగా నటిస్తున్నాయి. ఇదే స్వయమానమైన, నిత్యమైన, జ్ఞానమయమైన నిగూఢ పరమ రహస్యం.

ఒకవ్యక్తి బహుజన్మాంతర సాధనా విశేషం వల్లగానీ, ఈ జన్మలో చేసిన సాధనా ఫలితం వల్ల గానీ, మహాత్ముడుగానో, సిద్ధుడుగానో, అవతారపురుషుడుగానో, లేకపోతే యోగిగానో లోకం చేత ఆరాధింపబడుతున్నాడంటే అయనకు ఎందరు పరమగురువులు, ఎందరు సిద్ధపురుషులు, ఎందరు అవతారమూర్తులు శక్తిపాతం చేశారో, శుభాశీస్సులు అందించారో మనం ఊహించుకోవచ్చు. దృశ్యాదృశ్య రూపాల్లో దివ్యశక్తి సమన్వితమైన వాళ్లు అనేకులు ప్రసాదించిన శక్తివల్లనే ఎవరన్నా శక్తిమంతులుకాగలరన్న విషయాన్ని మనం కాదనలేం. దశరథాత్మజుడై, మానవుడుగా

పుట్టిన శ్రీరాముడిలో రావణ సంహారానికి కావలసిన మహాశక్తిని ఎందరు దేవతలు, ఎందరు ఋషీశ్వరులు ధారపోసి, ఆయన్ను శక్తికేంద్రంగా మార్చారో రామాయణం చూస్తే మనకు తెలుస్తుంది. అలాగే అసురసంహారానికి సకల దేవతల శరీరాల్లోనుంచి బహిర్గతమైన శక్తుల సమాహార స్వరూపమే చండి (పరాశక్తి) అని సప్తశతి చెబుతున్నది. కాబట్టి విశ్వశక్తి వ్యక్తిలో నిలువెల్లా ప్రసరిస్తూ ఉండటమే అవతార లక్షణమని మనం ఒప్పుకోకతప్పదు.

(సశేషం)




"విశ్వప్రకాశం" ఆధ్యాత్మికమాసపత్రిక, హైదరాబాదు.

సభ్యత్వము పొందండి.

ఆధ్యాత్మిక విషయాలు తెలుసుకొండి

సభ్యత్వ వివరము

| | |
|---|---|
| మహారాజ పోషకులు | రు. 15000-00 |
| రాజ పోషకులు | రు. 10,000-00 |
| పోషకులు | రు 5000-00 |
| శాశ్వత సభ్యత్వము | రు. 1000-00 |
| ద్వివార్షికసభ్యత్వము | రు. 120-00 |
| వార్షిక సభ్యత్వము | రు. 60-00 |
| విడిప్రతి | రు. 5-00 |

ముఖ్య సంపాదకులు
సర్వార్థ సంక్షేమ సమితి